వస్తే ఎట్లా నిలుస్తుంది, అనేటటువంటిది అప్పుడు కూడా అనుకున్నటువంటిదే అందువల్ల నేను నా మిత్రులు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు మొదలయినవారంతా కలసి నవీన విజ్ఞానాన్ని ఆంధ్రప్రజానీకానికి అందిద్దామని ప్రయత్నం చేశాము నేనుకూడా ఉడతా భక్తితో కొద్దిగా వ్రాశాను జైళ్ళలో కూర్చొని వ్రాసుకుంటూ ఉండేవారము నేనూ, గోపాలరెడ్డిగారు కూర్చొని చదువుకుంటూ వుండేవారము ప్రపంచములోని కాన్స్టిట్యూషన్సును చదివాము ఇంగ్లండ్, డొమినియన్స్, యూరపు దేశాలు మొదలయిన వాటికి సంబంధించిన కాన్స్టిట్యూషన్స్‌ను టోటలి టేరియన్ దేశాలయొక్క కాన్స్టిట్యూషన్స్‌ను చదివాము ఏదో కొంత కృషిచేశాము అదీ అంతా అయిపోయింది చివరకు ఈ పదవి సన్యాసాశ్రమంలో వచ్చిందని శ్రీ గోపాలరెడ్డిగారు చెప్పారు నేను ఒప్పుకుంటున్నాను బహుశ సన్యాసాశ్రమం కాకుండా వానప్రస్థాశ్రమమేమో ఇది మొత్తమునకు అటువంటిదే ఇది సందేహం లేదు నోటికి తాళం వేసుకోవలసి వచ్చింది నాకు ఎప్పుడూ స్వతంత్రంగా ఉండడం అలవాటు పార్టీలోకూడా స్వతంత్రంగా ఉంటూ ఉండేటటువంటి వదతే నాది మినిమమ్ డిసిప్లిన్ (Minimum Discipline) నాది (నవ్వు) మత ధర్మముగా నేను ఇవన్నీ నిర్వర్తించాను స్వరాజ్యం వస్తుందని దిగామా ఉద్యమంలోకి ? నేను స్వరాజ్యం చూడనేమో, తరువాత ఆంధ్రరాష్ట్రం చూడనేమో అనుకున్నాను చూడకుండానే శ్రీ వెంకటప్పయ్యగారు పోయినారు విశాలాంధ్రము కూడా నాకు మత ధర్మమే అందువల్ల కొందరు వ్యతిరేకించినారని నాకు బయము లేదు మనము చేతనయినంతా చేస్తాము వదలిపెట్టి పోతాము ఇతరులెవరో దానిని సాగిస్తారు కాని, ఈ అదృష్టమేమిటంటే ఈ మూడు విషయాలు మనం చూశాము నేను బ్రతికి వుండి విశాలాంధ్ర చూడడం, స్థాపించడం, తరువాత మీరంతా కలసి నన్ను తీసుకుని వచ్చి ఈ కుర్చీమీద కూర్చో పెట్టడం, ఇదంతాకూడ నాకు చాలా గొప్ప విషయం నా జన్మ ధన్యమయింది ఈ ఆత్మకు ముసలితనం లేదు అది నా నమ్మకం ఆత్మకు ముసలి తనమూ లేదు మరణము లేదు అందువల్ల ఈ శరీరము కృశించి పోయినప్పటికీ మనస్సు నిరుత్సాహ పడటం తప్పు ఎప్పుడూ కూడా కొత్త విషయాలు మనం గ్రహించుతూ వుండాలి ఇది నా నమ్మకములలో మరొకటి రిసెప్టివ్ మైండ్ ( Receptive mind ) తోఉండాలి ఓపెన్‌మైన్‌డ్ ( Open mind ) తోఉండాలి వెనుకబడి ఎక్కడో ఒక చోట ఫుల్‌స్టాప్ పెట్టుకొని ఉండకూడదు ఇది కూడా నా నమ్మకం గ్లేడ్‌స్టన్ దగ్గరనుంచి నేను నేర్చుకున్నది "స్టూడెంట్ ఇన్ లైఫ్" (Student in life) అనే విషయం ఎప్పుడూ నేను పుస్తకాలు చదువుతూనే వుంటాను నాకది అలవాటు ఇందుకు భగవంతుడు నాకు శక్తి ఇచ్చుగాక అని కోరుతున్నాను

ఇక నా పార్లమెంటరీ జీవితం విషయం ఉన్నది ౧౯౨౬వ సంవత్సరం నుంచి కాంగ్రెస్ వారు శాసనసభలకు అభ్యర్థులను నిలిపినప్పుడల్లా నన్ను నిలుపుతూనేవచ్చారు ౧౯౨౬లో పార్లమెంటరీ యాక్టివిటీస్‌తో సంబంధం పెట్టుకున్నప్పుడు నన్ను మద్రాసు కౌన్సిలుకు నిల బెట్టారు తిరిగి ౧౯౩౭లో నన్ను మద్రాస్ లెజిస్లేటివ్ ఎసంబ్లీకి నిలబెట్టారు అప్పుడు మంత్రిపదవి ఇవ్వటానికి వీలులేక రాజగోపాలాచారిగారు చీఫ్ పార్లమెంటరీ శక్రటరీగా నాకు చాలా తరిఫీదు ఇచ్చారు ఆ సమయంలో నా మిత్రులు అయినటువంటి హిందూ పత్రిక ఎడిటరుగారు స్పీకర్‌షిప్ ఇవ్వండి కాళేశ్వరరావుగారికి అనిచెప్పారు కాని, స్పీకరుషిప్ ఇస్తే పార్లమెంటరీ యాక్టివిటీస్‌నుంచి పోతాడు అతను స్వాభావికంగా పార్లమెంటేరియన్

కాబట్టి స్పీకర్‌షిప్ ఇవ్వనన్నారు ఆయన అప్పుడు స్పీకర్‌షిప్ నాకు తేలికగా వచ్చేది కాని ఆయన ఒప్పుకోలేదు నేనుకూడా సరే అన్నాను స్పీకర్‌షిప్ లేనప్పుడు, మంత్రిపదవి లేనప్పుడు చీఫ్ పార్లమెంటరీ సెక్రెటరీగా ఉండి వారి క్రింద చాలా తరిఫీదు పొందాను శ్రీ గోపాలరెడ్డిగారు అప్పుడు మంత్రిగా ఉన్నారు అంతా కలసి ఒక కుటుంబముగా పని చేసుకున్న రోజులవి కాని, ఇప్పుడు ఒప్పుకున్నాను, స్పీకర్ పదవికి, ఏదో పెద్దవాడను అవుతున్నాను పోనీ అని

శ్రీ కె వెంకట్రావు ఇంకా పెద్ద వారవుతున్నారనేన !

మిస్టర్ స్పీకర్ మనము ముఖ్యంగా సోషలిస్టిక్ పేట్రిన్ ఆఫ్ సొసయిటీని నిర్మించుకోవలసిఉంది ఆ పనిలో తోడ్పడవచ్చును భావాలు ఇవ్వవచ్చును కేవలం యాక్టివ్ ఎలక్షన్ పోలటిక్సులో, కాంగ్రెస్ కమిటీలలో ఉండనక్కరలేదు కాని, తక్కిన విషయాలలో పాల్గొనవచ్చు గాంధేయ పద్ధతులలో సోషలిస్టిక్ ఆర్డర్ ఆఫ్ సొసైటీ మనకు రావలెనని ప్రయత్నంచేసే విషయంలోకూడా నేను యాక్టివ్ పార్టు తీసుకొనవలెనని నా ఆశ

శ్రీ కె వెంకట్రావు బయటనే

మిస్టర్ స్పీకర్ అది బయటనే ఇక్కడకూడా సోషలిస్టిక్ ఆర్డర్ ఆఫ్ సొసైటీని మీరు తీసుకుని రావాలి ఈ శాసనసభ అందుకే ఆ ఆదర్శంకోసమే మనము శాసనములను సృష్టించుకోవాలి మంత్రులు అందుకు పనిచేయవలె శాసనసభ్యులు అందుకు పనిచేయవలె కాబట్టి మనము ప్రోగ్రెసివ్ లెజిస్లేషన్ చాలా చేసుకొనవలసిఉంది దానిలో నేను మీకు తోడ్పడుతాను

గోపాలరెడ్డిగారు చెప్పినట్లు, ఇంతకుముందు మహామహులంతా సభాధ్యక్షులుగా ఉండినారు చింతలపాడి నరసింహారావుగారు మొదట అధ్యక్షులుగా ఉండినారు తరువాత మహారి సాంబమూర్తిగారు ఉండినారు తరువాత శివషణ్ముగంపిళ్ళైగారు ఉండినారు తరువాత నల్లపాటి వెంకటరామయ్యగారు ఉండినారు నేను వారి time లో లేనుకోండి తరువాత రొక్కంలక్ష్మీనరసింహం దొరగారు ఉన్నారు పైద్యాగారిని గురించి కూడ నేను చాలా విన్నాను వారు సుప్రసిద్ధ న్యాయవాదులు, వారు అనేక సంవత్సరాలనుంచి కాంగ్రెసులో ఉన్నటువంటి వారు, వారు బహుజాగ్రత్తగా బహు గౌరవంగా ఈ హైదరాబాదు శాసనసభను నడిపించారని విన్నాను వీరందరి తరువాత నేను వచ్చాను వారియొక్క Traditions, పరంపరానుగతమైన పద్ధతులను నేనుకూడ అనుసరిస్తానని వాగ్దానం చేస్తున్నాను బ్రిటిష్ పార్లమెంటుయొక్క పద్ధతులు చాలా మంచివి ఎందుకంటే వాళ్ళది Mother of Parliament అని చెప్పబడుతున్నది వాళ్ళు ఆ పద్ధతినంత బహుజాగ్రత్తగా తీసుకు వచ్చారు వాళ్ళు సామ్రాజ్య వాదులైన, వాళ్ళ దేశాన్నిమాత్రం చాల జాగ్రత్తగా democratic గా కాపాడుకొంటూ వచ్చారు కాబట్టి మనము ఆ విధంగా democratic గా పోవలసియుంటుంది ఈ కుటుంబానికి నన్ను పెద్దగా ఎన్నుకొన్నారు కనుక సభ్యులందరియొక్క గౌరవాన్ని హక్కులను కాపాడటమే నా విధి అప్పుడప్పుడు అభిప్రాయ భేదాలు ఉంటే ఉండవచ్చు Freedom of speech, freedom of writing, freedom of

press ఇవన్నీ వుంటాయి వారి వారి అభిప్రాయాల ప్రకారం ఉపన్యాసాలు ఇచ్చుకోవచ్చు విమర్శలు చేసుకోవచ్చు కాని ఏదీ జరిగినా ఎప్పుడూ సౌజన్యంతో జరగాలి విమర్శలు చేసుకొన్నా కఠినంగా మాట్లాడకుండా చేసుకోవలసియుంటుంది అయితే పార్టీ భేదం లేకుండా అందరి హక్కులను సంరక్షించి, హిందూదేశంలో ఒక గౌరవకరమైనటువంటి ప్రతిష్టతో కూడినటువంటి శాసనసభను ఈ ఆంధ్రప్రదేశ్‌లో నిర్మించుకోడానికి నాయొక్క శక్తినంతా వినియోగిస్తానని నేను గట్టిగా మనవి చేస్తున్నాను ఆంధ్రప్రదేశ్ వచ్చింది ఇప్పుడు 3,౨౦ లక్షల ఆంధ్రులతో కూడిన అఖండమైన, అవిచ్ఛిన్నమైన ఆంధ్రప్రదేశము ఏర్పడింది మొత్తం 3,౫౦ లక్షలు గల ఆంధ్ర ప్రజానీకం బ్రిటిష్ సామ్రాజ్య వాదులచేత అనేక రాష్ట్రాలుగా పంచి పెట్టబడింది వారినంత ఇప్పుడు ఏకము చేయడానికి ప్రయత్నం చేస్తున్నాము ఇప్పుడు 3,౨౦ లక్షల ఆంధ్రులతో కూడిన విశాలాంధ్రనుసాధించుకొన్నాము ఇందాక ప్రకాశంగారు శలవిచ్చినట్లు ఇంకా మనకు రావలసినటువంటి భాగాలు వున్నాయి ఛాందా జిల్లాలో కొంత భాగము రావలసి యున్నది అట్లాగే ఇతర రాష్ట్రాలలో నుంచి కొన్ని భాగాలు రావలసి యున్నవి ప్రభుత్వంవారూ మీరందరూ సామరస్యంగా, negotiations ద్వారా zonal councils ద్వారా శాంతియుతమైనటువంటి ఆందోళనద్వారా అవన్నీ రాబట్టడానికి ప్రయత్నం చేయవలసి యుంటుంది నేను మీకు పైన వుండి ఆశీర్వదిస్తూ వుంటాను దాంట్లో నా సహాయం, నా వలుకుబడి ఏదైన కావలసియుంటే తప్పక ఆ విధంగా చేస్తాను

తరువాత, minorities యొక్క వెనుకబడిన ప్రాంతాలయొక్క రక్షణ చాల ముఖ్యమైనటువంటిది తెలంగాణాలో మనం కలసినామనేది నేను ఒప్పుకొంటున్నాను విశాలాంధ్ర ఆఖరు రాజధాని హైదరాబాద్ నైజాంముల్ ముల్క్‌కు అఖండమైన అవిచ్ఛిన్నమైన ఆఖరు రాజధాని హైదరాబాదే తరువాత బ్రిటిష్ సామ్రాజ్య వాదులు దేశాన్ని పంచి పెట్టారు ఇప్పుడు మనము మరలవెనుకకు పోయి హైదరాబాదు రాజధానికి వచ్చాము కనుక మనము హైదరాబాదులో చేరాము గాని మనలో వారు చేరిందనేదేమిలేదని నా అభిప్రాయం కాబట్టి ఇప్పుడు హైదరాబాదు రాజధానిగా వున్నటువంటి ఆంధ్రదేశము ఏర్పడింది ఇంక తెలంగాణా కొన్ని విషయాలలో వెనుకబడి వున్నదని వారికి కొన్ని safeguards, రక్షణలు ఏర్పాటు చేశారు ఆ రక్షణలను మనము గట్టిగా నిలబెట్టి అమలు జరుపవలెనని కోరుతున్నాను తరువాత ఉర్దు, కన్నడ, మహారాష్ట్రి ఇవి minority భాషలుగా ఇక్కడ వున్నాయి మాతృభాషలకు ప్రత్యేకమైన సంరక్షణ ఇవ్వాలని ఇప్పుడు వచ్చినటువంటి act లో ఉన్నది ఆ విధంగా చేయవలసిన బాధ్యత మీపైన ఉన్నది ఆ విషయంలో మీకు మద్దతు ఇస్తూ వుంటాను మనము తెలుగును రాష్ట్రభాషగా ఏర్పాటు చేసుకొంటున్నాము కాబట్టి తెలుగుకు ప్రధాన స్థానం ఇవ్వక తప్పదని నా ఉద్దేశము రెండవ స్థానం ఉర్దూ భాషకు ఇవ్వవలసి యుంటుంది ఇక్కడ muslims పెద్ద minority గా ఉన్నారు, కాబట్టి ఉర్దూ భాషకు ఇక్కడ ప్రధాన స్థానమున్నది మూడవస్థానం ఇంగ్లీషు ఆక్రమించు కోవాలి ఇంగ్లీషు ౧౦, ౧౫ ఏళ్ళలో పోయేటటువంటిది కాబట్టి, అది క్షీణ చంద్రునివంటిది కనుక దానిపట్ల మనము ఎక్కువ శ్రద్ధ చూపనవసరం లేదు

మీరు ఈ సభాధ్యక్ష స్థానాన్ని నాకు ఇచ్చి నన్ను గౌరవించినందుకు మీకు నా కృతజ్ఞత తెలియజేస్తూ విరమించే ముందు ఒక announcement చేయదలచు కొన్నాను

## Announcement re Removal of Silver Mace

మిస్టర్ స్పీకర్ మీరందరు ఇష్టపడినట్లయితే, మీ అందరి అనుమతితో ఈ Silver mace ను తీసివేయాలని కోరుతున్నాను ఇది ఒక Feudal Relic, Royal Sign గా ఉండినటువంటిది కాని Democratic States లో, మద్రాసులోగాని, ఢిల్లీలోగాని, ఆంధ్రలో గాని ఎక్కడా ఇటువంటిది లేదు కనుక ఈ వెండి కర్రను ఇప్పటినుండి తీసివేయుటకు మీయొక్క అనుమతిని కోరుతున్నాను దీనికి మీరందరు ఒప్పుకొంటారని నేను నమ్ముతున్నాను

రెండవది మధ్యాహ్నం ఒక తీర్మానం రాబోతున్నది ఆంధ్రప్రదేశ్ కు కొత్తగా Legislative Council సృష్టించడం విషయంలో తీర్మానం రాబోతున్నది దానికి ఎవరైనా సవరణలు ఇవ్వదలచినట్లయితే మూడుగంటల లోపల సెక్రటరీ గారికి ఇస్తే బాగుంటుంది మళ్ళీ దానికి ప్రత్యేకంగా time ఇవ్వడం లేకుండా వుంటుంది. రేపు మూడు గంటలకు ఈ కార్యక్రమమంతా పూర్తిచేయదలచాము ఆంధ్ర విశ్వ విద్యాలయం Senate, Syndicate Electors మొదలుగాగల వారికి రేపు అందరు పోతున్నారు గనుక ఈ తీర్మానానికి సవరణలు ఇచ్చేటటువంటి వారు ఈదినం మూడు గంటల లోపల ఇవ్వవలసిందని కోరుతున్నాను

ఈ సభ తిరిగి మధ్యాహ్నం మూడు గంటలకు సమావేశమౌతుంది

*The House then adjourned for lunch till Three of the Clock*

*The House reassembled, after lunch, at Three of the Clock*

[*Mr Speaker in the Chair*]

## Resolution re Creation of a Legislative Council in the Andhra Pradesh State

*Mr Speaker* Shri N Sanjiva Reddy, Chief Minister will now move the resolution with regard to the creation of a Legislative Council in the Andhra Pradesh State

**Sri N Sanjiva Reddy* Mr Speaker, Sir, I beg to move

"That this Assembly recommends to the Parliament that a Legislative Council may be created in the State of Andhra Pradesh and that necessary legislation may be passed under Clause (1) of Article 169 of the Constitution of India, containing such provisions for the amendment of the Constitution as may be necessary to give effect to the provisions of the law and also such supplemental, incidental and consequential provisions as the Parliament may deem necessary"

ఈ తీర్మానాన్ని బలపరుస్తూ నేను ప్రత్యేకంగా ఉపన్యాసం చేయవలసిన అవసరం లేదను కుంటాను. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం యీ తీర్మానాన్ని హైదరాబాదు అసెంబ్లీ ఆమోదించింది. ఈ తీర్మానాన్ని హైదరాబాదు అసెంబ్లీ ప్యాసు చేసిన ఆంధ్రరాష్ట్ర శాసనసభా సమావేశంలో కూడా ఇదే తీర్మానం అంగీకరింపబడింది. కాబట్టి ఈ తీర్మానంయొక్క గుణగణాలను గురించి, ఆవశ్యకతను గురించి ఇప్పుడు చర్చించవలసిన అవసరం లేదు. ఈ శాసనసభలోని సభ్యులందరూ ఈ తీర్మానాన్ని కూలంకషంగా చర్చించి ఉన్నారు. ఎగువ సభ ఉండవలసిన అవసరం ఉన్నదా, లేదా, అనేటటువంటిది రెండు పక్షాలా వాదించటానికి అవకాశం ఉన్న సమస్య. దానికి అనుకూలంగానూ వాదించవచ్చును, ప్రతికూలంగానూ వాదించవచ్చును. అనుకూలంగా వాదించేవారికి ఎటువంటి ఘనమైన కారణాలు కనబడతాయో, ప్రతికూలంగా వాదించేవారికి కూడా అంతటి ఘనమైన కారణాలే కనబడతాయి. కాబట్టి ఎగువ సభలు ఉండటం అవసరమా, లేదా, అనే సమస్యను దేశం మొత్తం పైన ఆలోచించి అన్ని రాష్ట్రాలకు అనువర్తించేటట్లుగా ఒక నిర్ణయానికి వచ్చేవరకు మన ఆంధ్రప్రదేశ్‌లో కూడా ఒక ఎగువ శాసన సభ అవసరమనే కారణంవల్ల ఇక్కడ యీ తీర్మానాన్ని ప్రతిపాదిస్తున్నాను. చాలా రోజులుగా మద్రాసులోను, బొంబాయిలోను, యింకా కొన్ని రాష్ట్రాలలోను ఎగువ శాసనసభలు ఉన్నాయి. ఆంధ్ర రాష్ట్రంలో మాత్రం యింతకుపూర్వం ఎగువ శాసన సభ లేదు. వెనకటి హైదరాబాదు రాష్ట్రంలో కూడా లేదు. ఇప్పుడు ఈ రెండూ కలసి ఒక పెద్ద రాష్ట్రం ఏర్పడింది కాబట్టి ఇక్కడ మనంకూడా ఒక ఎగువ సభను నిర్మించుకొనుట అవసరమని భావిస్తున్నాను. క్రొత్తగా ఏర్పడిన మధ్యప్రదేశ్‌లో కూడా ఇంతకుముందు అటువంటి ఎగువ సభ లేకపోయినప్పటికి ఇప్పుడు కొత్తగా ఒకటి పెట్టుకొనుటకు నిర్ణయించుకొన్నారు. ఆవిధంగానే, ఆంధ్రరాష్ట్ర అసెంబ్లీలోనూ, హైదరాబాదు అసెంబ్లీలోనూ ప్యాసుచేసిన తీర్మానాలననుసరించి వెంటనే ఆంధ్రప్రదేశ్‌కు ఎగువ సభను ఏర్పాటు చేసి ఉంటే బాగుండేది. అప్పుడు, ఇక్కడ ఈ చర్చకు అవకాశంగాని, అవసరంగాని లేకుండా ఉండేది. మనకు ఎగువ సభ కావలెనని ఇదివరకే కోరినప్పటికీ ఏకారణంవల్లనో మరొక పర్యాయం ఈ తీర్మానాన్ని ఈ శాసన సభలో చర్చించి పంపించమని కోరినందున తిరిగి ఈ శాసన సభాసమావేశంలో ఈ తీర్మానాన్ని తీసుకురావలసి వచ్చింది. ఇక్కడ ఉన్న శాసన సభ్యులందరూ ఈ అంశాన్ని గురించి చర్చించినవారే కాబట్టి తిరిగి యిప్పుడు హెచ్చుకాలాన్ని మనం దీనికొరకు వినియోగించవలసిన అవసరం లేదనుకుంటాను. నాకు తోచినంతమట్టుకు మనకు ఎగువ శాసన సభ ఉండటం అవసరమేనని అభిప్రాయ పడుతున్నాను. ప్రజలచే ఎన్నుకొనబడిన టువంటి ప్రతినిధులం మనమంతా ఇక్కడఉన్నాము. అనేక విషయాలు మనం ఇక్కడ చర్చిస్తున్నాం, నిర్ణయాలు తీసుకొంటున్నాం. మనం ప్రజా ప్రతినిధులము కాబట్టి, సర్వ హక్కులూ ఈ శాసనసభకు ఉన్నాయి. కాని ఆ యా సమస్యలలో పాండిత్యం వహించిన పెద్దలను సలహాదారులుగానైనా అడగడానికి రెండవ సభ ఉంటే చాలా అనుకూలంగా ఉంటుందని భావిస్తున్నాను. ఆ యా సమస్యలపైన హెచ్చు విజ్ఞానాన్ని సంపాదించిన పెద్దలు రాజకీయాల్లో ప్రవేశించటానికి ఎన్నికలలో పాల్గొని పోటీలు పడటానికి చాలామంది యిష్టపడరు. అటువంటివారిని యీ రాజకీయ కల్లోలములో దించకుండా, ఓట్లు అర్థించవలసిన అవసరం లేకుండా, ఆ అగత్యం లేకుండా మనమందరం చేరి, వారిని మన ప్రతినిధులుగా ఎగువ శాసన సభకు పంపి, వారు అధికారయుక్తంగా తమ అభిప్రాయాన్ని వెల్లడించటానికి మాత్రమే మనము ఎగువ సభను కల్పిస్తున్నాము. తుదకు

చట్టాన్ని చేయవలసిన బాధ్యత సంపూర్ణంగా ఈ శాసన సభదే. రెండవ సభ సలహా మాత్రమే యిస్తుంది. వారి సూచనలను మనము అంగీకరించ వచ్చును, లేదా అంగీకరించకపోవచ్చును. మనం ఏదైనా తొందరపడి ఒక కార్యక్రమాన్ని నిర్ణయిస్తే, వారు తమ సలహ నిచ్చి దానిని పునరాలోచించవలసిందని తిరిగి మనకు పంపగలరే గాని, మనం చేసిన దానిని కాదనడానికి వారికి హక్కు లేదని తమకందరికీ తెలుసు. ఒక పర్యాయం తొందరపాటులో ఒక కార్యక్రమాన్ని నిర్ణయించుకొంటాము, ఆ పొరపాటు తరువాత తెలుస్తుంది. రెండవ శాసనసభ లేకపోతే మనం ఆ పొరపాటును, దేశానికి దానివలన నష్టం సంభవించిన తరువాత తెలుసుకుంటాము. ఇదీ మన వ్యక్తిగత జీవితములలో, రాజకీయాలలో, వ్యక్తులకు రాజకీయ పార్టీలకు కూడా అన్వయిస్తుంది. పలుమారు పొరపాట్లు చేస్తుంటాము, చేసి సరిదిద్దుకుంటూ ఉంటాము. రెండవ శాసన సభ ఒకటి ఉంటే అందులో మనకన్నా ఆ యా విషయాలను చక్కగా చదువుకొన్నవారు అనుభవజ్ఞులు ఉంటే, వారి సలహా కూడ పాటించే అవకాశము మనకు కలుగుతుంది. కాబట్టి రెండవ శాసన సభ ఉండటమువల్ల మేలు ఎంతవరకో గాని, చెరుపుమాత్రం లేదని నేను విశ్వసిస్తున్నాను. నేను విశ్వసించటమే కాదు, ఇక్కడ శాసన సభా నాయకుడుగా, రెండు శాసన సభలు చేసిన తీర్మానాన్ని మాత్రమే నేను ప్రవేశ పెడుతున్నాను. అది కొద్ది నెలలకు పూర్వమే జరిగిందిగాని ఎప్పుడో చాలా ఏళ్ల క్రింద జరిగిన విషయం కాదు. కొద్ది నెలలకు పూర్వము జరిగిన ఈ సమస్యను కారణాంతరములచే మరియొక పర్యాయము యిక్కడ మన ఎదుట తీసుకొనుట, చర్చించుకొనుట, మళ్ళ మన అభిప్రాయము వ్యక్తముచేయుట జరుగవలసి ఉన్నది. ఆనాడు ఈ శాసన సభలో ఉన్నటువంటి పి. డి. యఫ్. సభ్యులు మొదలైనవారు దీనిని వ్యతిరేకించిన విషయము కూడా అందరికీ తెలుసు. అక్కడ ఆంధ్ర శాసనసభలో కమ్యూనిస్టు పార్టీవారు వ్యతిరేకించారు. ఒక పర్యాయము వ్యతిరేకత జరిగి పోయింది. తమ అభిప్రాయము వ్యక్తపరిచారు. శాసనసభ అభిప్రాయం, అంటే ప్రజల అభిప్రాయం తెలుసుకొన్న తరువాత, ఒకతూరి తీర్మానం అయినది కాబట్టి ఈ పర్యాయం మరి అదే విధంగా నిర్ణయం తీసుకొనకుండా ఏకగ్రీవంగా నిర్ణయించటానికి ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను. వారి అభిప్రాయం వ్యక్తపరిచినారు. వారి అభిప్రాయం ఏమిటో ప్రజలకు, దేశానికి తెలుసు. హెచ్చుమంది ప్రజానీకం, హెచ్చుమంది ప్రజాప్రతినిధులు ఒక పద్ధతిని కావాలని కోరినప్పుడు కొద్ది నెలలలోపుననే దీనిని తారుమారు చేయటానికి ప్రయత్నించకుండా హృదయ పూర్వకంగా అంగీకారాన్ని తెలపడం మంచిది. దీనిలో ఉన్న మంచిని స్వీకరిస్తాము. తద్వారా కలిగే సత్ఫలితాన్ని అందరం పంచుకొందాము. దీనికి కొద్దిగా హెచ్చు ఖర్చు అవుతుంది, అనవసరంగా ఎందుకు అని కొంతమంది ఆక్షేపిస్తుంటారు. కాని ఇది ఆంధ్రప్రదేశ్‌కు సంబంధించినది మాత్రమే కాదు. ఈ హెచ్చు ఖర్చును ఇతర ప్రదేశాలవారు అందరు కూడా ఆమోదించి అంగీకరించారు. ఢిల్లీలో రెండవ సభ ఉన్నది. అక్కడ శ్రీ కుంజ్రు, అంబేద్కర్ మొదలైన పెద్దలు ఎందరో ఉండి సహాయము, సలహాలు యిస్తున్నారు. ఇక్కడకూడా ఒక ఎగువ సభను పెట్టుకుంటే, విద్యావిషయాలలో అనుభవజ్ఞులను, ఇంజనీరింగ్ నైపుణ్యం కలిగినవారిని, పరిపాలనా దక్షత కలిగి రిటైర్ అయిన ఉద్యోగస్థులను, లేదా ఏ రంగములోనైనా సరే ప్రత్యేకమైనటువంటి అనుభవం కలిగిన పెద్దలను తెచ్చి ఎగువ శాసనసభలో పెట్టుకునే అవకాశం కలుగుతుంది. దానివల్ల ఏ కొద్ది

లక్షలరూపాయలో ఖర్చు అవుతాయనే భావంతప్ప, వేరు కారణం కనుపించదు నాలుగైదు లక్షల రూపాయలకు మించదు ఆ ఖర్చు కోట్లకొలదీ రూపాయలు వెచ్చించి మనము కార్యక్రమాలు చేస్తున్నప్పుడు, యీ నాలుగులక్షల రూపాయల ఖర్చు హెచ్చు అనిపించుకోదు రెండు లక్షలు ఖర్చవుతుందని కొందరంటున్నారు నాలుగు లక్షలు అని కొందరంటున్నారు ఏదీ నిజమైనా, నాలుగులక్షల రూపాయలకు మించదు ఆ ఖర్చు ఈ నాలుగులక్షల ఖర్చుతో కొంత అనుభవం గలవాం సలహా ఇంత చౌకగా దొరికేదానిని అడ్డుకోవటం సరైనది కాదని తోస్తున్నది ఇది ఒక్క భారతదేశంలోనే కాదు, ఇతర దేశాలలో కూడా—అమెరికాలో ఫ్రాన్సులో, బ్రిటన్‌లో ఇంకా అనేకచోట్ల, ఎగువ శాసనసభలు ఉన్నవి అధికమైన అధికారాల లేకపోయినా ఎగువశాసనసభ ఉండటం మంచిదని భావించి, అందుకు నిర్ణయించాము రష్యా కాన్‌స్టిట్యూషన్‌లో కూడా రెండవ సభ ఉండాలని అంటున్నట్లు వింటున్నాము అధికారరీత్యా చెప్పలేముగాని, వారుగూడా ఎగువశాసనసభ ఉండాలని అనుకొంటున్నారని మిత్రులు చెప్పుతున్నారు మనమాదిరిగా లెజిస్లేచర్ పని చేస్తున్న దేశాలు అమెరికా, ఫ్రాన్సు, ఇంగ్లండ్‌లలో రెండు శాసనసభలు ఉన్నవి అనే సంగతి మనకు తెలుసు వేరే ఇతర కారణములు ఏమీ లేవు, ఈ రెండవశాసనసభ లేకపోవటానికి, ఖర్చు ఎక్కువ అవుతుందనే కారణం తప్పితే దీనికి వ్యతిరేకత కనబరచవలసిన ఆవశ్యకత కనబడదు ఈ కొద్ది వ్యయానికి మనము శంకించవలసినదేనా? ఈ ఎగువ సభవలన ఎంతవరకు ఉపయోగం ఉంటుంది అన్న విషయాన్ని పలుమారులు మనం చర్చించుకొన్నాము మనం ఒకతూరి ఇదీ చర్చించినటువంటి విషయం కాబట్టి, నేను తిరిగి దీర్ఘోపన్యాసము చేయవలసిన అవసరంలేదు ఏకగ్రీవంగా యీ పర్యాయమైనా దీనిని పాస్ చేయాలని, ఆంధ్ర, హైదరాబాదు, యీరెండు శాసనసభలూ కూడా తీర్మానం చేశాయి కాబట్టి, ఆ శాసనసభల నిర్ణయాన్ని గౌరవిస్తారని ఆశిస్తున్నాను రెండు శాసనసభలూ పాస్‌చేసిన తీర్మానం మాత్రమే, నేను ఇవాళ ప్రవేశపెడుతున్న తీర్మానమని మరొక పర్యాయము చెబుతూ, మనశాసనసభలు చేసిన తీర్మానం కాబట్టి, యీ పర్యాయము దానిని గౌరవించి, ఏకగ్రీవంగా పాస్‌చేయాలని కోరుతూ యీ శాసనసభముందు యీ తీర్మానాన్ని ఉంచుతున్నాను

*Mr Speaker* Resolution moved

"That this Assembly recommends to the Parliament that a Legislative Council may be created in the State of Andhra Pradesh and that necessary legislation may be passed under clause (1) of article 169 of the Constitution of India, containing such provisions for the amendment of the Constitution as may be necessary to give effect to the provisions of the law and also such supplemental, incidental and consequential provisions as the Parliament may deem necessary"

***Sri V D Deshpande** Mr Speaker, Sir, the hon Chief Minister has expressed the view that it would be better if we can have unanimity on this particular Resolution I should think we can have more and more occasions and problems on which we can

think in a common way, but, unfortunately, there are certain problems and there are certain basic approaches where, with all respect to each other, we beg to differ The present Resolution before the House is one of such problems, where we beg to differ with the Treasury Benches

This problem first came up for discussion in the former Andhra Assembly as well as in the former Hyderabad Assembly We, on behalf of the Opposition, unanimously felt that in the present situation of our country, creation of a Second Chamber for Andhra Pradesh State will not be advisable The hon Chief Minister has referred to the western countries and the practices there True, our democratic and parliamentary form which we are following in India is based mostly on the pattern that is being followed in western countries But to every problem we have got the nationalistic approach, and to these parliamentary institutions too, we have an approach which will be in keeping with the necessity and the specific conditions of our country First and foremost, my argument in opposing this Resolution is this Are we in a position today to afford any extra expenditure? The other day, I had the honour to talk with the Chief Minister of the former Andhra State, Sri Gopala Reddy, on the problem of the salaries of our low-paid employees—3rd grade and 4th grade I suggested to him that the salaries in Andhra are very low when compared to the salaries in former Hyderabad State and it would be good in our socialistic pattern of society and while we were inaugurating the great State, that we should be able to bring on par the salaries of 4th grade employees in Andhra with those in Hyderabad He told me "We have already got a deficit of Rs 4 crores in the budget Do you want us to increase it to Rs 10 or 12 crores?" Of course, at that time he said "I am not in the Ministry" Now he is in the Ministry His concern was that we should not have unnecessary expenditure though he felt in that particular case that it was necessary

*Sri B Gopala Reddy* Sir, I said at that time I was not in the Ministry

*Sri V D Deshpande* Yes, true

*Sri B Gopala Reddy* And the reasons are, now that I am in the Ministry

*Sri V D Deshpande* We all know that our finances do not permit us any extra expenditure We are now in the first

year of our Second Five-Year Plan and we are trying our every nerve to have economy and to have more finances for developing our State

Now, the question before us is the creation of a Second Chamber at this juncture On the eve of the coming bye-elections in Andhra Pradesh State and the general elections in the country, what compelling necessity is there for bringing in such a Resolution in this August House in this short session? True, in the former Andhra Assembly a Resolution was passed In the former Hyderabad Assembly also a similar Resolution was passed But permit me to point out that it could not get the necessary two-thirds majority of the House as such The same problem came before the House of People and it was discussed there I should not feel myself gratified that it was because of our arguments, solid arguments that the House of the People did not feel the necessity of creating such a House for Andhra Pradesh State through the States Reorganization Act I cannot necessarily say that the weight of our arguments received consideration there But, certainly, the August House of our country *i e*, the House of People, felt that it was unnecessary for it to provide a that have been put in the House by the hon Chief Minister probably, they could have got themselves convinced But it seems to me that they did not feel the necessity at all Here, they have created this great State with a population of 3 crores but they did not feel it too big enough to feel the want of talent in the Lower House and that it should be supplemented by the Second Chamber It is said that there are certain personalities, scientists, great literary persons, social workers, etc, who, probably, cannot find place in the Lower House through the present system of General Elections But permit me, Sir, to point out that our Country is based on a democratic system and the various democratic parties should be able, through their party machinery, to provide for personalities of this type After all the Second Chamber which we are going to create will have not more than 72 members out of which one-third will be elected by this House, and one-third more will come through the district boards and local bodies

About one-sixth will come through teachers and professors and one-sixth will be nominated by the Government Now, I want to know what special qualities the various sections that will go to make up the Second Chamber are going to have

371 or 373 Would that argument cut any ice, I respectfully ask the hon the Chief Minister? Of course, a very good point he has brought forward and it is a reflection on us, that certain literary persons do not find a place in our August House or that all of them may not be able to find a place in this House If it is a valid argument, what does it lead us to? What does it show? What does it talk of our democratic pretensions? If literate persons with quality cannot find a place in our August House, probably the machinery of election as at present constituted has certain defects It is a matter to be discussed by our National Leaders, and by all the parties to see and find out ways and means by which we will be able to utilise all available talent that would be useful to our country

Sir, these are some of the arguments because of which I feel that at present, there is no compelling necessity as such for creating a Second Chamber Examples have been given of other States ' Bombay has a Second Chamber, Madhya Pradesh has a Second Chamber, and if they can have, why not we " I believe that the reasons for the creation of Second Chambers in the previous regime and in the regime of the foreign Government that we had here, were that they served certain parties For certain personalities which they wanted to please, certain personalities whom they wanted to reward and certain personalities whom they wanted to associate themselves with, for them they have provided a Second Chamber, and as for traditions, they are hard Despite the fact that they claim to be revolutionaries-non-violent of course—old traditions are dying hard and the systems which were introduced in this country by our past rules persist and they are persisting in Bombay, in Madhya Pradesh and persisting in all the States and to-day here too we are likely to fall a prey to it

*Sri N Sanjeeva Reddi* The hon Leader of the Opposition is making a fundamental mistake There was no Upper House in Madhya Pradesh but it is created now He is harping on the old tradition and all that but I want to point out that there was no Upper House in that State previously

*Mr Speaker* It is so

*Sri V D Deshpande* Not one but half-a dozen States are there which have a Second Chamber I may not be correct in referring to a particular one, but my argument still stands that they have been created in a different perspective, in a different context when a foreign Government had to provide be-

cause of certain interests Now to day in our present situation, for the arguments I have put forward and which I do not wish to repeat, is that necessity existing, because of which we should rush up to create a Second Chamber? I use the words 'rushing up towards creating a Second Chabmer' because as I have earlier said we are just creating a new State, a State which we want to flourish, a State where we feel that finances are not sufficient enough A deficit budget is there In such a particular situation, unless there is a compelling necessity, can we afford the luxury of having a Second Chamber? That is my straight question If the hon Chief Minister proves to me and to my party that such compelling necessity exists, we will definitely reconsider our view on this particular problem But I have carefully tried to follow his argument and all the arguments which formerly were put in the Andhra Assembly and by his co parceners in the Hyderabad Assembly, are repeated and they, to say the least, have not convinced us He said that some time, we might commit mistakes and the mistakes might be corrected in the Second Chamber I do not know if he has quoted the working of certain Assemblies in other parts where the Second Chamber has been able to correct the Lower House If that is so, I would have certainly considered that point But the working of these Chambers in India has shown us that the Second Chamber does not necessarily get persons of more experience, of more talent and those who can correct the Lower House Take the example of the Houses that are working in India Are they necessarily better than the Lower Houses? Take our House of the People Can we say man to man and collectively that the House of the People is inferior compared to the Council of States? Can we necessarily say that the persons whom we send to the Council of States from the various Assemblies are persons of talent?

We would have no objection if at least we feel that it is a question of talent, sending great personalities to the Upper House, that has been the main reason But, there are other considerations, considerations other than talent, and certain adjustments, political and otherwise, had to be looked into, and mainly the second chambers have been serving certain purposes which necessarily are not, in each case, to provide for talent or for personalities or for social workers as such Therefore, Sir, I would respectfully beg to say that in the present situation, in the first year of the second five-year plan, while the finances of our new Andhra Pradesh State are poor and expenses have to be economised, I do not feel any compelling necessity for creating a Second Chamber Let us work this State for the present

with one chamber, let us all pull together with the resources we have, let us first build up a great and glorious Andhra State and if our experience proves that due to the peculiar position in our country the necessity for a second chamber exists and if we can afford to maintain it, this matter may be reconsidered at that time My party is not dogmatic as such in this respect, I would like to put it very clearly Certain arguments in favour of the creation of second chamber might be there, might be valid for certain circumstances, and they may be considered later But today, we feel that there is no compelling necessity to rush through this resolution and put ourselves to more expense and in a way expand the existing House which will neither help us for legislation nor provide for necessary talent Therefore, Sir, I have respectfully to oppose this resolution and request the hon Chief Minister to reconsider its passage now

*Mr Speaker* I have received two amendments, one from Sri S Vemayya and the other from Sri Vavilala Gopalakrishnayya I want them to move their amendments

*Sri S Vemayya (Buchireddypalem—Reserved)* Sir, I am not moving the amendment standing in my name

*Mr Speaker* I now call upon Sri Vavilala Gopalakrishnayya to move his amendment

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య — నేను నా సవరణను ఉపపాదించుటము లేదు

మిస్టర్ స్పీకర్ —అయితే, ఇప్పుడు మనం నిర్ణయించుకున్నటువంటి కార్యక్రమం ౫ గంటల వరకు ఈపూట జరుగుతుంది రేపు ౧౦ గంటలనుంచి ౧—౩౦ గంటలవరకు చర్చ జరుగుతుంది అప్పుడు vote తీసుకుంటాము ఇండియా రాజ్యాంగ చట్టం ౧౬౯ వ Article క్రింద ఎవరైతే హాజరయినారో వారినుండి vote తీసుకుని, వచ్చినవారికి ౨/౩ వంతు vote ఉన్నదో లేదో చూచుకోవలసి ఉన్నది ఆవిధంగా చూసుకుంటాము

శ్రీ పైడి నరసింహాప్పారావు (పాలకొండ) —అధ్యక్షా! ఈ రోజు చాలా సుదినం అని చెప్ప వచ్చును కారణమేమిటంటే ఆంధ్రప్రదేశ్ ప్రథమ సమావేశపు మొదటి తీర్మానమును ముఖ్య మంత్రిగారు ప్రతిపాదించారు దానిని మా Party తరఫున పూర్తిగా బలపరుస్తూ నేను మాట్లాడుతున్నాను 'భాయి భాయి హాంపిక్ హై' మన మందరం అన్నదమ్ములం ఆంధ్ర ప్రదేశ్‌ను మొదటిసారిగా ఏకంగా జయించాం ఆంధ్ర మంత్రివర్గం సుస్థిరంగావుంటూ, ఏకంగా ఉంటూ పనిచేస్తారని యీరోజు విన్నందుకు చాలా సంతోషము ఆ విధంగా వారందరి ఎదుట మాట్లాడటం నాకు చాలా ఆనందంగా ఉన్నది తర్వాత మన భారతదేశంలో బొంబాయి, ఉత్తరప్రదేశ్, బీహారు అనే పెద్ద రాష్ట్రములలో నాల్గవ స్థానమును ఆంధ్ర ప్రదేశ్ ఆక్రమించింది మనకంటె చిన్న రాష్ట్రములున్నాయి వాటిలో కూడా

రెండవ శాసనసభ ఉన్నది మనకున్న ఉభయ రాష్ట్రాలలో కూడా—ఇదివరకున్నటువంటి ఆంధ్ర రాష్ట్రం, హైదరాబాదు శాసన సభలు కలిసి—ఎగువ సభకావాలనే తీర్మానమును చేసివున్నాయి కాని ఇప్పుడు మళ్ళా ఏకారణంచేత ఇది వచ్చిందో తెలియదు పాడినపాటే పాడమన్నట్లు పేరుకు మాత్రం తీర్మానం pass చేయడంతప్ప ఇందులో పెద్ద విశేషమేమీ లేదని చెప్పడానికి బాధపడుతున్నాను నాలుగు లక్షలు ఖర్చవుతుందంటున్నారు నాలుగు లక్షలు ఖర్చయితే మాత్రం ఏమి? కరోజు ఖర్చు తగ్గించుకుంటే సంపోతుంది ఆవిధముగా తగ్గించుకునైనా చేయవలెనని చెబుతున్నాను ఎగువ శాసనసభ ఉండితీరాలి Local Boards లో కొన్ని పంచాయితీల ఎన్నికలయినాయి గ్రామాలనుండి కొందరు రావలసిన వారున్నారు మన ముఖ్యమంత్రిగారు చెప్పినట్లుగా పండితులు, మేధావంతులు సలహా ఇవ్వ తగిన వారినందరిని తీసుకు వచ్చుటకు వీలుగా ఎగువ శాసనసభ ఉండవలెనని ఈ తీర్మానమును బలపరుస్తూ విరమిస్తున్నాను

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య —అధ్యక్షా, ఈరెండో శాసన సభ ఉండవలెననే అభిప్రాయం గురించి తర్జన భర్జనలు అటు ఆంధ్ర రాష్ట్రంలోనూ, ఇటు హైదరాబాదురాష్ట్రం లోనూ జరిగినమాట నిజమే కొంత మంది తీవ్రంగా దానిని ప్రతిఘటించారు పార్టీ బలం తోటి ప్రభుత్వం తమ తీర్మానమును గెలిపించుకున్నది అంత మాత్రంచేత ఒక సిద్ధాంతానికి సంబంధించిన విషయం వచ్చినప్పుడు ఆనాడు అంగీకరించిన దానిని తప్పకుండా అంగీకరించండని చెబితే దానిని అంగీకరించవలసిన అవసరం ఏమీలేదని మనవి చేస్తున్నాను ముఖ్యంగా Parliamentary విధానంలో రెండు శాసన సభలు అనేవి ఇంగ్లండులో వెనుకటి రోజులలో ఏర్పడ్డవి ఆదిలో Lords సభ మాత్రమే ఏర్పడి వారు రాజ్యం ఏలుతున్నపుడు, ప్రజానీకం రోజురోజుకు హక్కులను స్థాపించుకొని ముందుకుపెడుతున్న రోజులలో రెండుశాసనసభలు ఏర్పాటు చేయవలసి వచ్చింది రోజురోజుకు ప్రజలు సాధించిన హక్కులను ఎప్పుడైతే అమలుజరుపుకుంటున్నారో దానిని వ్యతిరేకించడం పూర్తిగా చేతగాక అసలు తన నామరూపాలు పోగొట్టుకోలేక England లో House of Lords అని House of Commons అని రెండు సభలు ఏర్పాటు చేయడం జరిగింది చివరకు Lords కు హక్కులు లేకుండా పోయాయి మన స్వాతంత్ర్య పోరాటం రోజులలోనూ శాసన సభలు ఏవిధంగా ఉండాలని చర్చ చేసినప్పుడు రెండు శాసన సభలు సాధారణంగా అనవసరం అనేటటువంటిది వచ్చింది అయితే ప్రభుత్వపు నివేదికలలో, ప్రభుత్వం కోరుతున్నది కనుక కాదంటే వీలులేదేమోనని American policy ప్రకారంగా House of Representatives అని House of Senate అని రెండు ఏర్పరచాలని ఆలోచించుకోవడం జరిగింది అదే నెహ్రూ కమిటీ చేసిన సూచన అయితే రాష్ట్ర శాసనసభల వ్యవహారం వచ్చినప్పుడల్లా రాష్ట్రంలో రెండవ శాసన సభ పూర్తిగా అనవసర మనే అభిప్రాయం చాలమందికి ఉండడం జరిగింది రెండో శాసన సభ ప్రయోజనం ఏమిటి? వయోజన voting వచ్చిన తరువాత, సామాన్య ప్రజానీకం స్వేచ్ఛగా ఎన్నికలలో పాల్గొన డానికి వీలున్న తరువాత, పెద్దలను ఎన్నుకోడం లేదు, అదీ చాలా ప్రమాదమైనదీ అనేటటువంటి మనోతత్వం ఏదయినావుంటే నిజముగా ఆ మనోతత్వమే చాలా ప్రమాదకరమైనది దానికి ఎవరూ ఈ రోజున అంగీకరించడంలేదు కనుక యీనాటి ఎన్నికలు వయోజన వోటింగుతోటే నడుపుతున్నాము

ఎవరయినా ఎన్నికలలో రావడానికి వీలు లేక, అనుదిన తీవ్ర రాజకీయాలలో పాల్గొనకుండా సాధారణ రాజకీయాలలో పని చేస్తూ ఉన్నట్లయితే, వారికి చోటు ఇచ్చి వారి అభిప్రాయాలను స్వీకరించడానికి ఎగువ సభ ఉండాలనే వాదన ఇప్పుడు తీసుకు వస్తున్నారు ఈ సభలు రెండు విధాలుగా ఉన్నాయి ఒకటి, కేంద్రంలో ఉన్న రాజ్య సభ, లోక్‌సభ, రెండవది రాష్ట్రాలలో ఉన్న Councils, అసెంబ్లీలు కేంద్రంలో లోక్‌సభ, రాజ్యసభల అధికారాల విషయమై వివాదంవచ్చినపుడు, చివరకు రెండు సభలకు సమానస్థాయీ ఉన్నది అనడం జరిగింది Initiative కు కాని శాసనాలు తీసుకురావడానికి కాని రెండింటి లోను ప్రముఖస్థానం ఇస్తాము అని చెప్పారు అయితే ఈ రాజ్యసభ విషయంలో ప్రధానమంత్రి నెహ్రూగారి ప్రకటన సారాంశం తీసుకుంటే మరొక విధంగా కనిపిస్తోంది రేపు జరుగబోయే ఎన్నికల తరువాత మంత్రి వర్గం ఏర్పరిచే సందర్భంలో లోక్‌సభకు ఎన్నుకోబడిన వారిని మాత్రమే తీసుకోవాలని, రాజ్యసభ వారిని తీసుకో నక్కర లేదని, వారు ప్రజలచేత ఎన్నుకోబడిన వారు కారని, వారు ఎన్నుకోబడ వారిచేత ఎన్నుకో బడ్డవారని, అందుచేత వారి ప్రాతినిధ్యం ప్రజాప్రాతి నిధ్యం కాదని, అందుచేత లోక్‌సభలో ఉన్నవారినే మంత్రులుగా తీసుకోవడం సరిఅయినదేమో అన్న అభిప్రాయం నెహ్రూ గారి ప్రకటన బట్టి తేలుతోంది దీనిని బట్టి చూస్తే లోక్‌సభ, రాజ్యసభలకు ఉన్న అధికారాలు సమానమైనవని అన్నప్పటికీ, రాజ్యసభ ప్రతినిధులు మంత్రివర్గ సభ్యులుగా ఉండడానికి పనికిరారని అనడంవల్ల ఆ సభ అవసరం కూడా తీరినట్లే కనిపిస్తోంది ఇటువంటి సందర్భంలో రెండు శాసన సభలు ఉండాలని కోరడం చాలావిషాదంగా ఉన్నది రెండు శాసనసభలు ఎందుకు అవసర మైనాయి ? శాసనసభల ప్రొసీజరుకు సంబంధించిన రూల్సుప్రకారం మొదట చూద్దాము ఎగువ శాసనసభకు ఉన్న అధికారం ఏమిటి ? ఏమైనా తీర్మానం చేస్తారా అంటే క్రిందసభ తీర్మానం చేస్తుంది దానిని ఎగువ సభకు పంపుతారు స్పీకరు గారి ఆదేశంప్రకారం ౧౫ రోజులలోనో ౨౦ రోజులలోనో వారి అభిప్రాయాన్ని చెప్పాలి వారు ఆ తీర్మానాన్ని అంగీకరిస్తారా అంగీకరించరా అనే సమస్య ఉన్నది ఆ ౧౫, ౨౦ రోజులలో ఏ అభిప్రాయం చెప్పకపోతే అంగీకరించినట్లే అర్థం అంగీకరించకపోయినా అంగీకరించినట్లే అర్థం అటు వంటప్పుడు ఈ ఎగువ సభవల్ల ప్రయోజనం ఏమిటి ? చాలామంది సభ్యులు ఉండడానికి అలంకార ప్రాయంగా decorative గాఉండవచ్చును దీనివల్ల శాసనసభలకు రావడానికి ఎక్కువ మంది విజ్ఞానవంతులు రావడానికి అవకాశం ఇస్తాము అంటారా ఆ విధంగా ఇందులోనికి రాగలిగిన వారు ౧/౬ వంతు మాత్రమే ఉంటారు అంటే ౧౨ మంది వస్తారు మన లెక్కల ప్రకారం మద్రాసు రాష్ట్రంలోని ఎగువ సభను తీసుకుందాము అక్కడ శ్రీ లక్ష్మణస్వామి మొదలియారుగారు మొద లైన వారిని nominate చేస్తారు వారు ప్రభుత్వ విద్యావిధానం గురించి ఆర్థికవిధానం గురించి కాని సునిశితంగా చర్చ చేసి ఎంత ఉదారంగా చెప్పినా మీరు చెప్పినారు కాబట్టి మేము విన్నాము అనే ధోరణిలో ఉంటున్నారే తప్ప వారు చెప్పిన విషయాలను జనసామాన్యం అంగీ కరించిన వాటినైనా సరే ప్రభుత్వం అంగీకరించిన సందర్భాలు లేవు పెద్దవారిని తీసుకు వచ్చి వారు చెప్పిన ఆలోచనలను అంగీకరించకుండా ఉంటే వారికి కూడా కష్టంగానే ఉంటుంది ఈ విషయం చాలాసార్లు లక్ష్మణస్వామి మొదలియారుగారు చెప్పిన దానిని బట్టి తెలుస్తుంది మేము చెప్పిన వాటిని దేనినీ అంగీకరించకుండా మమ్ములను ఉంచిన ప్రయోజనం

ఏమిటని ఆయన అడిగారు కూడా రాజ్యాంగరీత్యా తీసుకుని చూస్తే ఈ ఎగువ సభలోనికి వచ్చేవారు ఎవరు ? మన ఆంధ్రప్రదేశ్‌నే తీసుకుందాము, మొదటి sub clause ప్రకారం జిల్లా బోర్డులు మునిసిపాలిటీలనుంచి రావాలి ఆంధ్రప్రాంతాన్ని తీసుకుని చూస్తే అక్కడ జిల్లాబోర్డులు ఎక్కడ ఉన్నాయి ? జిల్లాబోర్డు సభ్యులు ఎక్కడ ఉన్నారు ? ఎవరు వీరిని ఎన్నుకుంటారు ? సలహా సంఘాలలోని సభ్యులే ఎన్నుకుంటారా ? స్పెషల్ ఆఫీసరు నామినేటు చేసిన వారితో వ్యవహారం సాగిపోతుంది కవున్సిలులోనికి ప్రతినిధులను కూడా ఆయనే single transferable vote ప్రకారం పంపిస్తారేమో నాకు తెలియదు తెలంగాణా ప్రాంతానికి వస్తే, జిల్లాబోర్డులలో నామినేషనులు, జిల్లా కలెక్టరు ప్రాబల్యం ఎంతో ఉన్నది ఇక్కడ క్రొత్తగా చట్టాన్ని తీసుకువచ్చారు వీటినన్నింటిని integrate చేయవలసి ఉంటుంది ఈ పరిస్థితులలో ఈ స్థానాలకు ఎవరిని పంపిస్తారు ? బహుశా మనము

వుద్దేశించే కౌన్సిలులోని ౭౨ స్థానాలలో ౨౪ స్థానాలు ఈ స్థానిక సంస్థలకు వస్తాయి ఈ స్థానాలకు ఏ విధంగా ప్రాతినిధ్యం ఇవ్వాలో తెలుసుకోలేని స్థితిలో ఈ తీర్మానంచేయడం వల్ల ప్రయోజనం ఏమిటి ? ఇంక నామినేషన్ల విషయం తీసుకుందాము ౧౯౫౨ ఎన్నికల తరువాత మద్రాసు కవున్సిలుకు కొన్ని నామినేషన్లు చేశారు రాజగోపాలాచారిగారిని ముఖ్యమంత్రిగా చేయాలని నిర్ణయించుకుని దానికి దారికోసము ఆయనను నామినేటు చేశారు కామరాజు నాడారుగారు ముఖ్యమంత్రి కాదలచినప్పుడు తన పార్లమెంటు సభ్యత్వానికి రాజీనామా ఇచ్చి శాసనసభ్యుణ్ణి ఒకనిని రాజీనామా చేయించి ఆస్థానంలో ఎన్నిక అయినారు అదే విధంగా రాజగోపాలాచారిగారు చేసి యుండవచ్చును కాని ధైర్యం లేకనో, ఏ కారణంచేతనో, nominate అయి ముఖ్యమంత్రి అయినారు ఆయన ముఖ్యమంత్రి కాకుండా ఉంటే nominate అయినా ఫరవాలేదు సమర్థుడు కూడా ముఖ్యమంత్రిగా చేయడానికి నిర్ణయించేసుకుని నామినేషను చేస్తే అది political nomination కాదా అని అడుగుతున్నాను ఒమాండూరు రామస్వామిరెడ్డియార్ గారున్నారు ఆయన ముఖ్యమంత్రిగా పనిచేశారు ఆయినను కూడా nominate చేశారు ఇవి అన్నీ political nominations కాక ఏమిటి ? పృథ్వీ రాజకపూర్‌గారు ప్రసిద్ధ సినీమానటుడు ఆయనను రాజ్యసభలోనికి తీసుకు వచ్చారు ఆ విధంగా ఎవరైనా రాష్ట్రాలలో వచ్చారా అంటే రాలేదు మద్రాసు శాసనసభలో సంగీత గాయకురాలు సుబ్బలక్ష్మిగారిని ఒకరిని తీసుకు వచ్చినారేమో సంతోషించవలసిందే అయితే సుబ్బలక్ష్మిగారైనా కళ మీదకాని మరొకదాని మీదకాని ప్రత్యేకంగా శాసనసభలో చేసిన ప్రతిపాదనలేవీ కనిపించడంలేదు బయట చెబుతున్నవే తప్ప అందరికీ విసుగ్గా ఉంటే హాయిగా పాడి సంతోషాన్ని ఇవ్వగలుగుతారేమో ఇక ఆర్థిక పరిస్థితిదృష్ట్యా కూడా ఆలోచించుదాము శ్రీమన్నారాయణ రిపోర్టు అమలు జరిగితే మన పరిస్థితి ఏమిటంటే ౧౨ కోట్లరూపాయల లోటు బడ్జెటులో ఉంటాము రాజ్యాంగంలోని Directive Principles ప్రకారం మద్యపాననిషేధాన్ని అమలు చేస్తారా లేదా ? అమలుచేసి ౧౨ కోట్ల రూపాయలలోటు బడ్జెటుతో ఉంటూ అలంకార ప్రాయంగా decorative గా ఉండే సభ్యులను తీసుకురావడం నేను చెబితే కష్టంగా ఉంటుందేమోకాని nepotism or patronage కు asylum అవుతుందనే భయం నాకు ఉన్నదీ ఈ విషయాన్ని తీవ్రంగా ఆలోచించాలని మనవిచేస్తున్నాను ఆంధ్ర రాష్ట్రంలో ఇప్పుడు వచ్చిన ప్రమాదం ఏమీలేదు రెండు శాసనసభలు కావాలని

తీర్మానం చేసుకుని కేంద్రం దగ్గరకు వెళ్ళాము వారు మరల ఆలోచించుకుని తిరిగి తీర్మానం చేయాలని అన్నారు ఆ తీర్మానం తొందరపడి చేసినామేమో ఆంధ్రరాష్ట్రానికి ఇటువంటి ఎగువ సభ అనవసరం, తిరిగి ఆలోచించుకుంటే రాష్ట్ర ఆర్థిక పరిస్థితులను తప్పకుండా గుర్తించి ఆలోచిస్తారని ఆ విధంగా పునరాలోచించి అలా తీసుకు రాకుండా ఉంటారనే ఉద్దేశంతోనే అటువంటి సలహా ఇచ్చారు లోక్ సభలో చర్చ జరిగినప్పుడు చాలామంది సభ్యులు అడిగారు క్రొత్తగా ఏర్పడిన మధ్యప్రదేశ్ కు ఎగువ సభ ఇచ్చారు, ఆంధ్ర ప్రదేశ్ కు ఇవ్వలేదేమి అని అడిగారు మధ్యప్రదేశ్ పరిస్థితులు వేరు, ఆంధ్రప్రదేశ్ పరిస్థితులు వేరు, అవసరమయితే మరల తీర్మానం చేస్తారని జవాబు చెప్పారు అవసరంలేదనే వారు అనుకుంటున్నారు కొద్ది రోజులలో అసెంబ్లీ ఎన్నికలు రానున్నాయి అందులో క్రొత్తగా గెలుచుకున్న వారెవరయినా రావచ్చును ఇప్పుడు ఒక చిక్కు ఉన్న మాట నాకు తెలుసును మంత్రులుగా ఉన్న కొందరు, సభలో సభ్యులుగా లేరు వారు తప్పకుండ ఎన్నికలలో ఎన్నిక అయి వస్తారని నా నమ్మకం వారి కోసము ఇది తీసుకు వచ్చారని నేను అనడం లేదు వారికోసము తీసుకురావలసి వస్తుందని కూడా నేను అనుకోవడం లేదు మన రాజకీయ పరిస్థితులను, ఆర్థికస్థితి గతులను విచారించి, మన విన్నపాన్ని ఒక సారి పార్లమెంటు త్రోసివేసిన తరువాత, తిరిగి మరొక పిటిషన్ లో వెళ్ళి ఎగువ సభ కావాలని అడగడం న్యాయమా అని అడుగుతున్నాను మూలసూత్రం క్రింద ఎగువ సభ అవసరమని అంటారా, నెహ్రూగారు ప్రకటించిన దానిని బట్టి రాజ్యసభ నుంచి మంత్రులను తీసుకోడానికి వీలు లేదు అంటున్నారు మరొక వైపు శాస్త్రీ రాజ్యాంగరీత్యాగాని, రూల్సు ప్రకారం కాని ఎగువ సభకు అధికారాలు లేవు ప్రాతినిధ్యం ఇవ్వవలసినజిల్లాబోర్డులలో సభ్యులు లేరు, ఇక ఎందుకు ఇది? ఆంధ్రప్రదేశ్ లో ఎగువ సభ ఉండవలసిన అవసరం లేదని పరోక్ష ఎన్నికలద్వారా కాక ప్రత్యక్ష ఎన్నికలద్వారా వచ్చిన ప్రతినిధులచేత పంపాలన నిర్వహింపబడేటట్లు చూడాలని మంత్రివర్గంవారిని కోరుతూ ఈ తీర్మానాన్ని నేను వ్యతిరేకిస్తున్నాను

*Sri Gopalrao Ekbote (Chaderghat)* Mr Speaker, Sir I rise to support the resolution

On such an occasion as this, it is always natural that the old controversy which centres round this question is brought to the surface Whether there is any usefulness in the Upper Chamber or not is a question on which much literature can be found, both against and in support of it It will not be out of place if we discuss even academically some aspects of the Upper Chamber, because it is only when we keep in view the fundamental and basic principles on the basis of which Upper Chambers are generally constituted that we will be able to get a correct perspective Otherwise, as is now found, we are apt to be lost in certain sentimental approaches, which, let me say with a little amount of frankness, may sound for the moment as quite substantial but, so far as the main question is concerned, are beside the point

If we look to other countries, one thing which we come across is that many Constitutions have specifically provided for the constitution of an Upper House There are, however, some very

notable exceptions to the general rule But I can say with confidence that even those countries which were once opposing the constitution of a Second Chamber and had stuck to the unicameralism have again come round to the view that the bi cameral system of legislatures is not only sound in its approach to the various legislative projects but also helps in solving the bigger problems with which a State is generally confronted

If we look to the Constitutional provisions under which there can be a Legislative Council in the Andhra Pradesh, the heterogenous constitution or composition of such a Legislative Council clearly assures us that the complex and diverse elements which will be able to find a place in the other House will certainly have a retarding and healthy influence on the legislative measures which are generally pushed ahead in the Lower House I do not wish to speak disdainfully of the Lower House, but all those who are usually concerned with the Legislative Assemblies have certainly experienced that the Universal suffrage as we in India have does usually send to the Legislative Assembly that product which is usually found to be very progressive I do concede that point But in view of the lack of time, the lack of sufficient legal talent among the members of the Lower House, and the various complex and diverse legislative measures which are bound to come up in the wake of the constitution of a socialistic State, it is absolutely necessary that at some stage or other, there must be a machinery which will give more sober thought to all the legislative measures which are brought before the Legislative Assembly It is the usual experience of those who are connected with the drafting of the legislative measures that the lack of experts for drafting various legislative projects, the lack of sufficient, as I said, material in the Legislative Assemblies have clearly resulted in one thing, and those connected with the Law Courts will bear me out when I submit that various decisions of the High Courts and the Supreme Court have gone to prove that the legislative measures which are drafted loosely and are allowed to be pushed through in the Legislative Assemblies in haste have been found very poorly drafted and on many occasions have been declared ultra vires, necessitating again their going back to the Legislative Assemblies for enacting what has been found as superfluous or ultra vires If this waste is to be stopped and if more careful attention is to be bestowed upon the legislative measures, it is absolutely necessary, either at the drafting stage or at the stage of consideration of a Bill clause by clause by the Legislative Assembly or at a stage before it is finally tested by

the Judiciary, that persons belonging to a different category with legalistic experience to their credit or with a higher, if I am permitted to say, superior, or, supplemental, intellectual attainment, should scrutinize at the level of the Upper House and I am confident that they will act not only in scrutinizing and finding out whether, as a whole, a particular measure is in the interests of the people or not, but will also help to improve upon the legislative measure It has been found, as I said, that the Lower Houses are usually not only very democratic but radical in their approaches and the argument which is usually advanced while opposing the constitution of an Upper House is that such a measure stifles the democratic voice of the people, because the composition of the Upper Chamber is heterogenous in its nature and the Governor is authorised to nominate as many as one-third of the members of the Upper House—

*An hon Member* Not one third, but one sixth

*Shri Gopalrao Ekbote* I do not exactly remember the total number It may be one-twelfth or one sixth The number is going to be considerable

If we keep in view the whole composition of the Upper Council and keep in view also its heterogenous nature as I submitted, it gives us a clear picture of the persons who go to occupy those seats and how they can act and bring to bear upon the legislative measures influence which would certainly be wholesome

Some number of the Legislative Council is to be drawn from the Graduates' constituency having three years' standing and residing in the State, some number of members is to be drawn from the Teachers' constituency belonging to not lower than the secondary school and residing again in the State and belonging to various, whether private or Government, educational institutions Then there are representatives elected by the various local bodies, about 1/3 of the members, and, as I said, the nominations by the Governor would come in The nominations by the Governor should, however, be of persons who are experts in literature, co operative movement, social services and other fields, which are found useful If we keep in view this composition of the Council and also the further restriction that those persons who are to be nominated would naturally belong to the age-group of beyond 30 years and also the further restriction that the total number does not exceed one-fourth of the total

argument But keeping in view the enormous wastage which is involved in poorly drafted legislative measures and their again coming back to the Assembly, it does not prove ultimately very economical If I am allowed to say so, it is a very false notion of economy

With these points, Sir, I beg to submit that this question should be considered not from any sentimental point of view but purely from the point of view of the present conditions in which we are working—the present atmosphere or present situation in which we are working—and the material which we have at different stages of legislation We want to establish a socialistic society only through the Rule of Law and if we want to establish that pattern of society through a Rule of Law, we have to have Laws which are free from any flaw or defect, and it is only then that we can clearly establish a Rule of Law in our State And if this is to be attained, we should have a Second Chamber consisting of those who have a definitely superior talent or supplementary talent and give them an opportunity to revise and to reconsider the entire legislative projects and to give ultimately a beneficial legislation which will ultimately lead to the cherished goal of ours

With these few words, I submit that the resolution may be supported and passed

*శ్రీ కె వి ఎస్ పద్మనాభరాజు (రేవిడి) —అధ్యక్షా! ఈనాడు మన ముఖ్యమంత్రి గారు మన ఆంధ్ర ప్రదేశ్ కు Legislative Council ఉండాలని ఒక తీర్మానమును తీసుకుని రావడము జరిగింది ఈ తీర్మానము పై చాలా మంది సభ్యులు మాట్లాడి ఉన్నారు ప్రతి పక్షములో ఉన్న దేశపాండేగారు, గోపాల కృష్ణయ్యగారు కూడ ఈ Council మన రాష్ట్రమునకు అవసరము లేదని అభిప్రాయము వెల్లడించారు అదే విధముగా నేను కూడ మన రాష్ట్రమునకు ఉన్న ప్రస్తుత పరిస్థితులనుబట్టి, అవసరము లేదనే పూర్తిగా వారితో ఏకీభవిసున్నాను అసలు మనకు Council ఎందుకు ఉండాలి అనేదాని మీద ముఖ్యమంత్రి సంజీవరెడ్డిగారు దేశములో బుద్ధిమంతులు, మేధావులుగాఉన్న వారిని ఈ ఎగువ సభలో సభ్యులుగాచేర్చి, వారియొక్క సలహాలను గూడ శాసనసభచేయు శాసనముల విషయములో తీసుకుంటే బాగా ఉంటుంది, అది దేశ శ్రేయస్సుకు తోడ్పడు నట్టిదిగా ఉంటుందని, అందువల్ల ఈసభ అవసరముగనుక, దానికై ఈ తీర్మానము తెచ్చానని చెప్పారు ఇదిగాక ఆర్థికంగా గూడ ఈ ఎగువ సభకు ఎక్కువ ఖర్చు ఏమీ ఉండదు, బహుశః ఏనాలుగు లక్షలో అవుతుంది, అది అంతపెద్ద ఖర్చులో చేరిందికాదు అనే point లేవదీసి చెప్పారు మనకు ఇంతవరకు ఈ ఎగువ సభను గురించి మా అనుభవమునుబట్టి, మాకు తెలిసి నంతవరకు చూస్తే, దేశములోని బుద్ధిమంతులను, మేధాశక్తి గలవారిని తీసుకుని రావడమ్ము

ఎంతవరకు జరిగింది అనేది పరిశీలించాలంటే, పూర్వపు చరిత్రలో ఇది ఎంతవరకు జరిగిందో చూడాలి ఎన్నికలలో పాల్గొని, ప్రజలకు విశ్వాసము లేక ఓడిపోయినవారు, యిలాంటి వారిని ఏదోవిధముగా ఈ ఎగువ సభ అనే పేరుతోగాని, రాజ్యసభ అనే పేరుతోగాని, తీసుకునివచ్చి ఈ ఎగువ సభలో సభ్యులుగా చేర్చడముతప్ప, మరేమికాదు అలాంటి ఓడిపోయినవారు, నిజముగా ప్రజలకు వారియందు విశ్వాసము ఉంటే, ఎన్నుకోబడ గలిగినవారే కాని వారిని ప్రజలు ఎన్నుకోలేదు ప్రజల విశ్వాసమును పొందలేని వారిని ఈ ఎగువ సభకు సభ్యులుగా చేర్చడము ప్రజాస్వామ్యము అనిపించుకోదు నిజానికి చూస్తే, సంజీవరెడ్డిగారు చెప్పిన విషయాలను బట్టి ఆలోచించితే, తెలివిగల వారిని, మేధావంతులను తీసుకుని రావడము ఎక్కడనూ జరగడములేదు ఇది నిజముగా జరుగుతుందని నేను అనుకోవడములేదు రాష్ట్రము యొక్క ఆర్థిక పరిస్థితిచూస్తే, మనకులోటు బడ్జెటు ఉన్నది అందుకు పన్నులు ఇంకా ఎక్కువగావేసి లోటును పూర్తిచేసుకోవాలి అని ఒక ప్రైపున ప్రభుత్వ పక్షమువారు చెబుతూన్నప్పుడు, ఈ ఎగువ సభకు ఇంకా నాలుగు లక్షలు ఖర్చుచేస్తామని చెప్పడములో ఈ బడ్జటులోటును మరింత ఎక్కువ చేయడము తప్ప మరేమిటి అని గుర్తించాలి ఈ నాలుగు లక్షలు ఏమంత పెద్దఖర్చులోనిది కాదని సంజీవ రెడ్డిగారు చెబుతున్నారు పెద్ద ఖర్చుకాదు అని చెబితే, నాలుగు లక్షలేకాదు, అది పది లక్షలు అయినా కావచ్చు నిజానికి ఒక్క విషయము గుర్తించండి ఇంత వరకు హైదరాబాదు రాష్ట్రమునకా, ఎగువ సభలేదు ఆంధ్ర రాష్ట్రానికా, అంతకంటెలేదు ఇలాంటి పరిస్థితులలో మన దేశములో మనము నిజమైన ప్రజాస్వామికము అమలు జరుపుకోవాలంటే, ప్రజలచేత ఎన్నుకోబడినవారినే, సభ్యులుగా చేర్చాలి ప్రజలచేత ఎన్నుకోఒడిన వారితో మనము శాసనసభ జరుపుకుంటున్నాము మనకు ఇంతవరకు indirect గా ఎన్నుకొనబడే ఇంకొక సభ లేనేలేదు పండిట్ నెహ్రూగారు కూడ ఇదివరలో అసలు మనకు ఈ ఎగువ సభలు అక్కరలేదు, ఎక్కడైనా ఉంటే వాటిని రద్దు చేయడమే మంచిది అని తమ ఉపన్యాసాలలో పెల్లడించారు అలాంటప్పుడు మనకు మాత్రము ఈ ఎగువ సభ ఎందుకు అని అంటున్నాను ఒక ప్రైపున ప్రధానమంత్రే ఈ ఎగువ సభలు అక్కరలేదని అంటూంటే, మనము ఈసభ ఉండాలని తీర్మానము తేవడము అర్థరహితము పోనీ, ఎన్నికలలో ప్రజలచేత ఎన్నుకోబడిన వారాఅంటే అదేమికాదు ఎవరినో ఉద్యోగము లేనివారికి ఇదొక విధముగా ఉద్యోగములు కల్పించి పోషించాలనే ఉద్దేశ్యము తప్ప మరేమికాదు కాబట్టి మనకు ఇప్పటివరకు జరుగుతున్న సాంప్రదాయాన్నే మనము అమలు జరుపుకోవడము సమంజసము

పోతే రెండవ విషయము నాయకులు ఈ విషయములో తీసుకున్న నిర్ణయములు ఏ విధముగా ఉన్నవో చూడండి కాంగ్రెసు హయాములో దేశములో నిరుద్యోగ సమస్య పెచ్చు పెరిగి పోతున్నది ఈ సమస్యను పరిష్కరించాలి అంటున్నారు కాని అలాంటి ఉద్దేశ్యముతో కాంగ్రెసులేదు అందువల్ల కాబోలు ఈనాడు ఈ ఎగువ సభలు అనే పేరుతో ఏ ౭౦ మందినో పోషించటానికి ప్రభుత్వము చూస్తున్నట్లున్నది అంతకంటే మరేమికాదు అంతేగాని నిజంగా దేశములో ఉన్న మేధావంతులను తెచ్చి, వారి సలహాలను పొందటానికని కనబడదు ఈ విధముగా చేసిననూ, నిరుద్యోగ సమస తీరుతుందా? తీరనేతీరదు కాబట్టి మనకు ఈ ఎగువ సభ ఇదివరకు లేదు కాబట్టి, ఇకముందు కూడ మనకు ఇది అక్కరలేదు

యీ సభతో మనకవసరములేదు ఈసభ లేనంత మాత్రాన మనము సరియైన శాసనములు చేయలేక పోతున్నామా ? ప్రజలకు కావలసిన శాసనములు మనము శాసన సభలో చర్చించ గలుగుతున్నాము అంతకంటె ఇంక ఎగువ సభలో మాత్రము ఎక్కువ లభించేది యేమీ ఉండదు నిరుద్యోగులను పోషించాలంటే, వేరు మార్గములు లేకపోలేదు ప్రజా ప్రతినిధులుగా ఎన్నికైన వారిచేత మనము ఆంధ్ర ప్రదేశ్ కు శాసన సభను ఏర్పాటు జేసుకుని సుస్థిరముగా ఆంధ్ర ప్రదేశ్ ను పరిపాలించటానికి ప్రయత్నము చేయాలేగాని, ఈ ఎగువ సభవల్ల కలిగే లాభము ఏమీ లేదు కాబట్టి ఈనాటి తీర్మానమును ప్రభుత్వము ఉపసంహరించు కోవాలని కోరుతున్నాను ఇలాచెప్పేది నేనేకాదు పలువురు సభ్యులు కూడ చెబుతూనే ఉన్నారు ప్రధాన మంత్రియైన పండిత నెహ్రూగారు కూడా ఎగువ సభ అక్కర లేదని చెబుతున్నప్పుడు మనము గూడ అక్కర లేదని చెబితే మంచిది కేంద్రము లోఈ విషయము గురించి ఇంకా తర్జన భర్జనలు జరుగుతూన్న సమయములో ఈనాడు ఈలాంటి తీర్మానము తేవడము సరైనదికాదు ఇది ఏర్పాటు చేసేటట్లయితే ప్రభుత్వము తాలూకు ద్రవ్యమును దుర్వినియోగము చేయడము తప్ప మరేమికాదు ప్రజలు ఏదైనా పనిచేయమని ప్రభుత్వాన్ని కోరితే, మాకు డబ్బులేదని చెబుతున్నారు అలాంటప్పుడు ఈ సభకుగాను డబ్బు ఎక్కడినుంచి తేగలరో అర్థము కావడములేదు ఇది ఏదో కొంతమందిని దొడ్డిదారిని సభలోచేర్చే పద్ధతిగా కనబడుతున్నది నిజముగా ప్రజలచేత ఎన్నుకోబడిన వారైతే పరవాలేదు అట్లా గాకుండా ప్రభుత్వము ఏదో చెడుభావాలను మనస్సులో పెట్టుకుని, రాజకీయ పక్షములో ఉన్నవారిని తెచ్చిపెట్టటానికి చూస్తున్నట్లు బోధపడుతున్నది ఈ మధ్య తెలంగాణాలో నిరుత్సాహము చెలరేగిన కారణముచేత, ఆ నిరుత్సాహపరులను ఈ విధముగా తృప్తిపరచాలనేగాని, ఇది నిజమైన ఎగువ సభగా ఏర్పాటు కావడము కనబడదు కాబట్టి మా పార్టీ యొక్క అభిప్రాయముగా ఈసభ అక్కరలేదనే చెబుతున్నాము కాబట్టి ఈ తీర్మానమును ప్రభుత్వము ఉపసంహరించుకోవాలని ముఖ్య మంత్రిగారిని కోరుతూ విరమిస్తున్నాను

శ్రీమతి సి అమ్మన్నరాజా అధ్యక్షా ! మనకు లెజిస్లేటివ్ కౌన్సిల్ వుండాలా, అక్కర లేదా అనేది ఈనాటి చర్చనీయాంశము ఇదివరకె మన అసెంబ్లీలోను, ఇక్కడకూడా Reorganisation of Sattes Bill మీద మన అభిప్రాయాలను వెల్లడి చేశాము ప్రతి విషయానికీ కొంతమంది వ్యతిరేకంగా ఉంటూనే ఉంటారు అందుకు తగిన కారణాలుకూడా లేకపోలేదు మన ముఖ్యమంత్రిగారు చెప్పినట్లుగా కావాలనడానికి, అక్కర లేదనడానికి రెండువైపులాకూడా సరైన కారణాలే చూపవచ్చు కొంతమంది దీనిని Second Chamber అంటారు ఇంకా కొంతమంది Elders Chamber అంటారు ఇంకాకొంతమంది Upper House అంటారు కానిదీనిని Upper House అనడానికి వీలులేదు, Elders Chamber అనడానికి వీలులేదు అయితే 30 సం ల హద్దుపెట్టినప్పటికికూడ వాళ్ళకంటె పెద్దవాళ్ళు మన అసెంబ్లీలోనూ, వుంటారు మనకంటె చిన్నవాళ్లు ఆ కౌన్సిలులోను ఉంటారు ఏదో తొందరపాటులో మనం కొన్ని నిర్ణయాలు చేసుకొన్నప్పుడు, వాటిని reconsider చేయడానికి అవకాశం కలుగుటకు Council అనేది వుండడం చాల అవసరమని మనం నిర్ణయించాము Time లేక పోవుటవలననో, ఎక్కువ పనులుండుటవల్లనో ఒక్కొక్కసారి తొందర తొందరగా శాసనాలు చేస్తూవుంటాము కాబట్టి Council వున్నట్లు

యితే వాటిని reconsider చేయడానికి వీలుంటుంది Council లోనుంచి అనుభవజ్ఞులు ఉంటారు ఇంతకుముందు ఇతర సభ్యులు చెప్పినట్లుగా representation లేనటువంటి కొంతమంది దీనిలోనికి రావడానికి అవకాశాలు కల్గుతాయి Elections లో నిలబడడానికి ఇష్టంలేనివారు కొంతమంది వుంటారు అటువంటివారి అనుభవాలను మనం ఉపయోగించుకోవటానికి అవకాశం కల్గుతుంది ప్రతి దానికి ఉపార్థాలు చేయవచ్చు Motives ఆరోపించవచ్చు Council ఉంటే కొన్ని మంచి పనులు చేయడానికి అవకాశముంటుందను కొనే వాళ్ళు ఇంతకు ముందు వారికి వున్న వ్యతిరేక అభిప్రాయాలను మార్చుకుంటే బాగుంటుందనుకొంటున్నాను ప్రతి విషయానికీ వేరే అభిప్రాయాలు ఆరోపించడం అనవసరం దేశంలో ముత్తు లక్ష్మీరెడ్డిగారి లాంటి వారు, గొప్ప అనుభవము కలవారు, దేశసేవ, సంఘసేవ చేసినవారూ అనేకమంది ఉన్నారు అటువంటివారి అనుభవాలను మనం ఉపయోగించుకోవడం చాలా అవసరం పైగా కళాకారులనుకూడా దీనిలోనికి తీసుకురావడానికి అవకాశం ఉంటుంది ఇదంతా decorative అని శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు చెప్పారు అంతకంటె decorative గా మన అసెంబ్లీలో ఉండవచ్చు ఇక్కడికంటె అన్యాయంగా కౌన్సిలులోనూ ఉండవచ్చు ప్రత్యేకం decoration కొరకే కౌన్సిల్ కావాలంటున్నారనడం చాలా అన్యాయం అనుకొంటున్నాను మనం decoration కొరకు తీసుకురావడము లేదు గొప్పవారియొక్క అనుభవాలను ఉపయోగించుకుందామనే దృష్టితో తీసుకు వస్తున్నాము కొంతమంది యొక్క సలహాలను తీసుకొందామనే అనుకుంటున్నాము కాని కేవలం decoration కొరకు కాదు మనకు decoration కావలసివస్తే Flower vase తెచ్చిపెట్టుకోవచ్చు కాని ఇంత కటువుగా విమర్శించడం చాలా అన్యాయమని నేను అభిప్రాయ పడుతున్నాను ఇప్పుడు శ్రీ కాళేశ్వర రావుగారే ఉన్నారనుకోండి ౧౯౬౨ వ సంవత్సరము తరువాత ఆయనకు మళ్ళా

మిస్టర్ స్పీకర్ — మీరు అధ్యక్షుల వారిని address చేస్తున్నారని జ్ఞాపకం పెట్టుకోండి

శ్రీమతి సి అమ్మన్నరాజా శ్రీ కాళేశ్వరరావుగారి లాంటివారు కొంతమంది ఉండవచ్చు వారు మళ్లా elections లో బాధపడలేరు elections లో తిరగడం ఎంతో కష్టమైన విషయం ఎంత పలుకుబడిఉన్నప్పటికీ తిరిగిచూడవలసి ఉంటుంది అటువంటివారికి ఆబాధ తప్పించినవారం అవుతాము అయినప్పటికీ అట్టి వారి అనుభవం మనకు కావాలంటే Council ఉండడం చాలా అవసరం

అదీ కాక, కొంతమందికి ఉద్యోగాలు కల్పించడంకోసం కొంత మందిని Ministers గా చేయడంకోసం ఇటువంటి Council ను ఏర్పాటుచేస్తున్నారని కొంతమంది అనుకొంటున్నారని నేను అభిప్రాయపడుతున్నాను వారి అనుభవాలను ఉపయోగించుకునేందుకు మాత్రమే

తీసుకువస్తున్నాము, కాని కేవలం వారికి ఉద్యోగాలు కల్పించడంకోసం కాదు మనం ఇచ్చే ఈ ఉద్యోగాలు లేకపోయినా చక్కగా బ్రతకగల్గినవారినే అందులోకి తీసుకువస్తాము దీనివల్ల చక్కని precedent ఏర్పాటవుతుందని అనుకొంటున్నాను ఎన్నికల ద్వారా వచ్చిన వారినే తప్ప కౌన్సిల్‌నుంచి మంత్రులుగా తీసుకోకుండావుంటేనే న్యాయంగా వుంటుందనుకొంటున్నాను కాబట్టి మనం అటువంటి పొరపాటు అభిప్రాయాలను ఉంచుకో నక్కరలేదు సారస్వతంలోనూ, కళలలోనూ, ఇంకా అనేక యితర fields లోనూ మంచి ప్రాముఖ్యం గడించి, పెద్ద అనుభవంగలిగి, మర్యాదస్తులుగా వుంటూ, సాధారణమైన రాజకీయాలంటే యిష్ట పడనివారినే మనం కౌన్సిలులో సభ్యులుగాచేసి వారి అనుభవాలను ఉపయోగించుకోవడం చాలా అవసరం

"మనది లోటు బడ్జట్, మళ్ళీ ఇంకో సభను ఏర్పాటుచేస్తే ఎక్కువ ఖర్చు అయి పోతుంది" అని చాలా మంది అంటున్నారు ఇష్టంలేనప్పుడు అనేక కారణాలుచెప్పవచ్చు ఈ సభను ఏర్పాటుచేసినందువల్ల పెద్ద ఖర్చుకాదు ఈ విషయం మన అందరకూతెలుసు ఎవరిమట్టుకు వారు ఇతరులులేకుండా తామే ఆ పనులన్నీ చేయగల్గుతామని అనుకొంటూవుంటారు కాని అది సరియైన అభిప్రాయంకాదు మన దేశాన్ని పురోగమనంతో అభివృద్ధిలోనికి తీసుకు రావాలంటే ఎక్కువమంది అనుభవజ్ఞులను అభిప్రాయాలను తీసుకొని ఏ పనిచేసినప్పటికీ, ఏ శాసనంచేసినప్పటికి మనమంతా ఒప్పుకోవలసిందే కాబట్టి ఎగువసభవద్దు అనుకునే వారంతా వారి అభిప్రాయాలను మార్చుకొని, ఏకాభిప్రాయంతో దీనిని తప్పకుండా ఒప్పుకుంటారని ఆశిస్తూ విరమిస్తున్నాను

శ్రీ కె వెంకటరామరావు (చినకొండూరు) అధ్యక్షా! Chief Minister గారు ఎంతో convincing గా ఈ తీర్మానాన్ని ప్రవేశపెట్టడానికి ప్రయత్నించినారు అయినా కూడా ఈ తీర్మానాన్ని వ్యతిరేకించవలసివచ్చినందుకు చాలా విచారబడుచున్నాను ఏమైనప్పటికీ ఈ తీర్మానాన్ని నేను వ్యతిరేకించవలసివస్తున్నది ఈ ఎగువసభ విషయాన్ని గురించి ఆంధ్ర శాసనసభ హైదరాబాదు శాసనసభ కూడా ఇదివరకే తీర్మానాలు చేసినాయి అందువల్ల ఆ తీర్మానాల వెలుగులో ఈనాడు వీలైనంత తొందరగా దీనిని pass చేస్తే బాగుంటుందని తెలవిచ్చారు ఈ సందర్భంలో హైదరాబాదు శాసనసభకు సంబంధించినంతవరకు నాకు ఉన్న పరిచయాన్ని తెలియచేయదలచుకొన్నాను హైదరాబాదు శాసనసభలో ఈ తీర్మానం వచ్చినప్పుడు వోటుల సంఖ్యను note చేయించాము మన రాజ్యాంగ చట్టములోని ౧౬౯వ Article ప్రకారం ౨/3 వంతు మెజారిటీ కావాలి Total members లేక members present లోనైనా ౨/3 majority కావాలి ఆ నాటి Proceedings ను చూస్తే హైదరాబాదు శాసనసభకు సంబంధించినంతవరకు ౨/3 Majority లేదు Constitutional provision ప్రకారం కావలసిన ౨/3 Majority లేనప్పుడు ఇది హైదరాబాదు శాసనసభయొక్క తీర్మానం అనిపించు కోడానికి విలులేదు అయినప్పటికీ ఇప్పుడు మెజారిటీలో వున్నారు Majority తో pass చేస్తే ఒప్పుకోవచ్చు ఇందుకు నాకేమీ ఆక్షేపణలేదు మన భారత

రాజ్యాంగం ప్రకారం మాత్రం అది హైదరాబాద్ శాసనసభయొక్క తీర్మానం కానేరదు రెండు శాసనసభలనుంచి recommendation పోయిన తరువాత పార్లమెంటు అంగీకరించక పోవడానికి నేను పైన జెప్పినదే కారణమనుకొంటాను ఇంతకుముందెప్పుడూ లేనటువంటి మధ్యప్రదేశ్‌లో ఒక లెజిస్లేటివ్ కౌన్సిల్‌ను సృషించారు అయితే మన ఆంధ్రప్రదేశ్ శాసన సభకు పార్లమెంటు అనుమతి ఇవ్వలేదు

దీని అర్థమేమో గమనించాలి తగినంత మెజారిటీ లేదనే దాని అర్థము లెజిస్లేటివ్ కౌన్సిలుకు సంబంధించినంతవరకు మనము రికమండేషను చేయవలసినదేగాని, చొరవ చేసుకొని సాధించ గలిగినదేమీ లేదు ఇదివరలో మనము యిక్కడనుంచి చేసిన రికమండేషను పార్లమెంటు నిరాకరించినది రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ శాసనం బహుశా ఆగస్టు చివరి వారంలోనో లేక సెప్టెంబర్ మొదటి వారంలోనో పాస్ అయినది అయితే యీ రెండు, మూడు నెలలవ్యవధిలో యేమంత బ్రహ్మాండంగా పరిస్థితులు మారినాయి ఆకాశము చిల్లులు పడలేదు, లేదా భూమిలోనుంచి ఏదైనా కొత్తపదార్థం వుత్పత్తి కాలేదు యీ రెండు మూడు నెలలలోపున వెనుకటి పరిస్థితులు మారినవని మాముందు సమాచారం పెట్టివుండినట్లయితే బహుశా మేమీ తీర్మానం విషయమై ఆలోచించి యుండేవారము నేను యింతకుముంద మాట్లాడిన శ్రీ దేశపాండేగా ఆ మాటలనే తిరిగి మనవి చేస్తున్నాను మేమీ సమస్యపైన డాగ్‌మేటిక్ గాలేము అయితే యీ రెండు మూడు నెలలలో పరిస్థితులు యేమంత మారినాయి ? గత అయిదేండ్లుగా యిక్కడ హైదరాబాదు శాసనసభ వున్నది తరువాత ఆంధ్రప్రదేశ్ శాసనసభ కూడా కొంతకాలము పని చేసినది ఈ మధ్య కాలములో లెజిస్లేటివ్ కౌన్సిలు లేనందువల్ల యేమినష్టం వచ్చినదో వుదాహరణలు యేమైనా వుంటే మేము యీ విషయమై ఆలోచించి వుండేవారం అలాంటి నష్టము వాటిల్లిన పరిస్థితులు యేమీలేవు ఇదే సంధర్భములో నేను ఒక లీగల్ ఏస్పెక్ట్ మనవి చేయదలచుకున్నాను రాజ్యాంగ చట్టము లోని ౧౬౯వ ఆర్టికల్ మనముందున్నది దానిలోని పదములు యీ విధముగా వున్నవి

"Notwithstanding anything in Article 168, Parliament may by law provide for the abolition of the Legislative Council of a State having such a Council or for the creation of such a council in the State having no such Council, if the Legislative Assembly of the State passes a resolution to that effect by a majority of the total membership of the Assembly and by a majority of not less than two-thirds of the members of the Assembly present and voting"

అయితే యిప్పుడు మనముందున్న గ్యారంటీ యేమిటి ? మనము మరల రికమండేషను చేసి, తీర్మానం పంపిస్తే, అది బుట్టదాఖలు కాదు అనే గ్యారంటీ యేమిటి ? ఇదివరకు ఒకసారి బుట్ట దాఖలు అయినది అది జరిగి యెక్కువ రోజులు కాలేదు బహుశా రెండు నెలలో మూడు నెలలో

ఈ మూడు నెలలలో తిరిగి తీర్మానం చేసి, వారిని తింగి దేబురించ వలసిన అవసరం యేమీలేదని నేను అనుకొంటున్నాను అయితే యిక్కడ నుంచి మనము యీ రిజల్యూషను పాస్ చేసి పంపిసే దానిని అంగీకరించడమో, అంగీకరించకపోవడమో, అనేది మరల పార్లమెంటు పైననే ఆధారి పడియున్నది రాజ్యాంగచట్టములోని నూటలరపైతొమ్మిదవ ఆర్టికల్ ను చూచినప్పటికీ కూడ అది "లెజిస్లేటిక్ కౌన్సిలు రద్దు" అనేదానితోనే ఆరంభ మవుతున్నది అయితే శుభం కోరరా పెండ్లికొడకా అంటే, మనము తత్ వ్యతిరేకంగా కొత్తగా మనకు లెజిస్లేటివ్ కౌన్సిల్ సృష్టించ మంటున్నాము రాజ్యాంగ చట్టములోని ఆర్టికల్ ఎబాలిషన్ ఆఫ్ ది లేజిస్లేటివ్ కౌన్సిల్ ( Abolition of the Legislative Council ) అనే దానితోనే ఆరంభమైనది క్రియేషన్ ఆఫ్ ది లెజిస్లేటివ్ అసెంబ్లీ అనేది తిరువాత ఆరంభ మవుతున్నది కానిస్టిట్యూషన్ లో ప్రొవిజన్ వుద్దేశించినవారిదృష్టిలోకూడ ఏబాలిషన్ ఆఫ్ ది కౌన్సిల్ ( Abolition of the Council ) కే ప్రాముఖ్యమున్నదని క్రియేష ఆఫ్ది కౌన్సిల్ కు అంత ప్రాముఖ్యత లేదనివమనము ననుకోవచ్చు యిది కాన్స్టిట్యూషనల్ ఏస్పెక్ట్ ( Constitutional aspect ) ఈ కానిస్టిట్యూషనల్ ఏస్పెక్ట్ను దృష్టిలో పెట్టుకొనే సెవాచార్యిగారు అన్నమాటలు మొన్ననో నిన్ననో పత్రికలలో వచ్చినవి ఇంతకు ముందు శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్యగారు వాటిని గురించి చెప్పారు ఆ విషయములనే మరలచెప్పి, నేను మీ కాలమును వృధాపుచ్చ వలసిన అవసరములేదు అయితే యిప్పుడు పరిస్థితులు మారినవని అమాంతముగా స్వర్గములోంచి భూమి మీదకు వూడి పడ్డట్టుగా అప్పర్ హౌసులోనికి వచ్చినవారు మినిస్టరులు అవుతారని కొంతమంది అనుకోవచ్చు సింగిల్ ట్రాన్స్ఫరబుల్ వోటు పద్ధతి ప్రకారము మన సభలోని ఒయిదున్నరమందో, ఆరున్నర మందో, లేక మూడున్నరమందికో ఒక్కొక్క సభ్యుని చొప్పున ఎన్నుకొని, లెజిస్లేటిన్ కౌన్సిల్ కు పంపవచ్చును లేదా రాజ్యసభలోని సభ్యుల సంఖ్యను ఆధారము చేసుకొని లెజిస్లేటివ్ కౌన్సిలుకు కొందరిని ఎన్నుకోవచ్చును ప్రజలతోగాని, లేక ప్రజలయొక్క సమస్యలతోగాని అట్టివారికి సంబంధము వుండదు గనుక వారిని మంత్రులుగా చేయవద్దని ఒక నిషేధము మాత్రము కాంగ్రెసు పార్టీకి సంబంధించిన వారినుంచి వచ్చింది ఈనాడు కాంగ్రెసు వరి పైఖరి ఎట్లా వున్నది, కాంగ్రెసు నాయకులు ఎట్లా ఆలోచిస్తున్నారు అనే విషయమె వారు చెప్పిన మాటలనే నేను మనవి చేయదలచుకున్నాను సోషలిస్టు సాంఘిక వ్యవస్థను సృష్టించాలనుకుంటున్న యీ కాలంలో వారు యెలాఆలోచిస్తున్నారో అన్నది చూడవలసి యున్నది అయితే లెజిస్లేటివ్ కౌన్సిలులో ప్రవీణులు వుంటారు, మరెవరో పెద్దలు వుంటారు అని చెప్పుట పాతకాలపు కారణం మాంధాతల కాలం నుంచి యిట్టికారణములువుండనే వున్నాయి ఈ విషయములో ఒటుపైపున వున్న సభ్యులు చాలా డాగ్మేటిక్గా ప్రవర్తిస్తున్నారేమో అనిపించవలసి వస్తున్నది ఇంతకు ముందు నుంచి కొన్ని రాష్ట్రములలో లెజిస్లేటివ్ కౌన్సిలు వున్నాయి ఉట్టిదే మదార్సు రాష్ట్రములో వున్నది, యు పి రాష్ట్రములో యున్నది యింకా కొన్ని యితర రాష్ట్రములలో వున్నది అయితే లెజిస్లేటివ్ అసెంబ్లి తొందరపడి ఒక్కకారుగా ఏదైనా శాసనంచేస్తే, దానిని లెజిస్లేటిన్ కౌన్సిల్ తిరిగి అసెంబ్లీకి పునర్విచారణ నిమిత్తం పంపినట్టి ఉదాహరణ ఏదైన ఉన్నదా ? నాకున్న కొద్దిపాటి అనుభవమును పురస్కరించుకొని అట్టి ఉదాహరణ లేదని

మాత్రము నేను చెప్పగలను అసెంబ్లీ తొందరపడి యేదైనా శాసనంచేస్తే అట్టిదానిని కౌన్సిల్‌లో యున్న పెద్దలు వెనుకకు పంపించిన సందర్భములు లేనేలేవనవచ్చును పెద్ద సభలో వున్నవాళ్లు పెద్ద మనుష్యులు, చిన్న సభలోవున్న వాళ్ళు చిన్న మనుష్యులు అనేటటువంటి ఒక విధమైన భావంతప్పో, ఒప్పోకాని డెవలప్ అవుతున్నట్లు కన్పిస్తున్నది లెజిస్లేటివ్ అసెంబ్లీ చేసిన పనులనుకౌన్సిల్ సరిదిద్ద గలిగినదిఅనే విషయంలో ఎలాంటి ఉదాహరణ లేదని మాత్రం నేను మనవి చేయగలను లెజిస్లేటివ్ కౌన్సిల్ పని అసెంబ్లీ చేసిన పనులను యించుమించు అంగీకరించడమే లెజిస్లేటివ్ కౌన్సిల్ యొక్క స్వభావము, నిర్మాణము అదే రూపంలో వుంటుంది ఈ సభలో వున్నటువంటి పరిస్థితులనే పైసభ కూడా ప్రతిబింబిస్తుంది ఇక్కడ యే యే పార్టీలకు యెంతెంత బలం వున్నదో యెగువసభలో కూడ ప్రతిబింబిస్తుంది పోనీ యీ ప్రవీణులు అనేనారు రాజకీయములలోపడి గందరగోళము యీ దుమ్ము దుమారములు రేపుకోడానికి యిష్టపడరు, అనుకొందామన్నా అది సంభవము కాని విషయము అట్టివారు కూడా యిట్టి రాజకీయములలోనికి రాకతప్పదు ఎవరో ఒకరు స్వతంత్రుడుగావచ్చి, నామినేషన్ దాఖలు చేసిన యెవరూ ఆయనకు ఓటు వేయరు ప్రతిపక్షాన్నో, లేక వివిధ పార్టీలలోని వారినో బ్రతిమిలాడో, భంగపడో వాళ్ళు ఓట్లు సంపాదించ కోవలసివస్తుంది ఆ విధంగా బ్రతిమిలాడో భంగపడోయితరుల ఆశీర్వచనములను పొందితేతప్ప వేరు గత్యంతరములేదు ఈ నాడు రాజకీయ పక్షములలో రెజిమెంటేషన్ యెక్కువగా జరిగిపోతున్నది ఎటుపోయినా, యేదో ఒక పార్టీ ఆశ్రయించితేతప్ప లాభం లేదు వేరుగత్యంతరము లేదు పుట్టగతులు వుండనటువంటి పరిస్థితులు వస్తున్నాయి అయితే పరిస్థితులు మారుతవి అనేటటువంటిదీ పేరుముచ్చట మారడానికి అవకాశములు లేవు, వుండబోవని నా విశ్వాసం ఈ నాటి పరిస్థితులలో మనమేదైనా తప్పుచేస్తే, లెజిస్లేటివ్ కౌన్సిల్‌లోని పెద్దమనుష్యులు దానిని సరిదిద్దు తారనే ఆశలేదు అందుచేత యిక్కడ మనం చేసిన దానిపై రబ్బరు స్టాంపు మాదిరిగా ముద్ర కొట్టడానికి రబ్బరు స్టాంపు సంస్థ యొక్కఅవసరము యేమివున్నది ? అవసరము ఉపయోగము లేదు సరిగదా, కాలవారణము మాత్రము జరుగుతుంది డబ్బు నష్టమైనా ఫరవా లేదంటాను, నాలుగు లక్షల రూపాయలు పోతే ఫరవాలేదు నలభై కోట్ల రూపాయల బడ్జెట్‌లో నాలుగు లక్షల రూపాయలు నష్టమైనవంటే అది పెద్ద సంగతికాదు కాని, యీ నాలుగు లక్షల రూపాయలు తక్కువ యేమీ కాదు, యీ ఐరావతాన్ని మేపడానికిమాత్రం నాలుగు లక్షల రూపాయలు ఖర్చు పెట్టవలసినదేనా ? ఆర్థికంగా మనం సమృద్ధిగా లేము ద్వితీయ పంచవర్ష ప్రణాళికను మనం సక్రమంగా నిర్వహించు కోవలసియుంది అన్నిరంగాలలో కూడ మనం ఎకానమీని యింప్లిమెంటు చేయవలసియుంది ఎకానమీ అనేది యీనాడుమన కార్యక్రమంలో ముఖ్యవిషయం వీలైనంతవరకు మితవ్యయం, పొదుపరితనం, మన ధ్యేయంగా వుండాలి ఈ నాడు పల్లెనుండి ఢిల్లీ దాకా నాయకులందరూ యిస్తున్న నినాదమిదే అయితే యీ విషయమై ఒక మిత్రుడు మాట్లాడుతూ, వుద్యోగముల సృష్టి కై యిట్టి తీర్మానము వుపకరిస్తుందన్నారు అయితే యీ వుద్యోగాలసృష్టి దేశ అవసరాలకు, శ్రేయస్సుకు సంబంధించినదైనట్లయితేనాకేమీ ఆక్షేపణ లేదు కాని, అక్కడ కూర్చున్న ప్రభుత్వ పక్షంవారు చెప్పినదైనా లేక యిక్కడ కూర్చున్న మనం చెప్పినదైనా యించుమించు తిరిగి చెప్పే వారుగల మరొకసభ అనవసరం ఇట్టి కౌన్సిల్ మనకు చాలా తోడ్పడగలదో లేదో, లెజిస్లేటివ్ కౌన్సిలులో కూడ సాధారణంగా పరిపాలక వర్గం చెప్పినది కొద్దిగా నైనా జరిగే పద్ధతే వుంటుంది అంటే ఆ సంస్థ పరిపాలక వర్గం యొక్క ప్రతిబింబంగానే వుంటుంది

నాలుగు లక్షల రూపాయల ఖర్చుకు నేను లక్ష్యపెట్టను నాలుగు లక్షల రూపాయలు పోతే పోయినవి కాని నాలుగు లక్షల రూపాయలకన్నా విలువగల కాలం వ్యర్థమవుతున్నది తొందరగా కావలసిన లెజిస్లేషన్ లిడితిలో పడిపోతుంది ఎంతో ఆలస్యమవుతుంది, ఎంతో కాలవారణమవుతుంది కాలవారణంకాకుండా వుండడానికి గాను యిట్టి సంస్థలనుమనం ఏర్పాటుచేసుకోకూడదు కనీసం కాలానికైనా విలువనివ్వండి డబ్బుపోతే పోయింది, పీడాబాసిరి కనీసం కాలానికైనా విలువనివ్వమని, మరల మనవిచేస్తున్నాను ఈ ఎగువసభ యించుమించు అజాగళస్థనమని చాలా మంది అంటున్నారు అజాగళస్థనంగా వున్నటువంటి అప్పర్ వశాసును మనం పెట్టకోవలసిన అవసరం లేదు ఇట్టి సంస్థవల్ల ఏ మాత్రము ఉపయోగముండదని, వెనుకటి అనభవములను బట్టి మనం గమనించుకోవలసిన యున్నది అట్టి సంస్థలవల్ల దేశమునకులాభము ఎక్కువగా వుంటుందనే అధారాలు మనముందు యేవీలేవు వెనుకటి అనుభవములు చూస్తే లెజిస్లేటన్ కౌన్సిల్ గుడ్డి కన్ను మాదిరిగా యున్నది గుడికన్ను తెరిస్తే ఎంతలాభమోమూసినా అంతేలాభం, మూసినా, తెరచినా ఒకటేరుగా యుండే యీ గుడ్డికన్ను వంటి అప్పర్‌వశాసును సృష్టించవలెననే యీ తీర్మానమును బవాఃశా వాపసు తీసుకుంటే చాలా బాగుంటుందని మనవి చేస్తూ శెలవు తీసుకుంటున్నాను

శ్రీ ఎం ఎస్ రాజలింగం (వరంగల్) అధ్యక్షా, ఇప్పుడు Legislative Council అనేది ఉండాలా వద్దా అనేది చర్చకువచ్చింది ఈ చర్చలలో ఏ దృక్పథమైతే కొంతమంది సభ్యులు తీసుకున్నారో అది సమయోచితమైంది కాదని నేనను కొంటున్నాను ఈ Legislative Council అనేటటువంటిది, కొంతమంది సభ్యులు అన్నట్లు, ఎవరో కొంతమందికి ఉద్యోగాలుగాని, పనులుగాని చేకూర్చడానికొసం పెట్టేటటువంటిదికాదు ఈ విషయాన్ని ఆ దృక్పధంతో చూడకూడదు మనము అనుకొన్న ప్రజాస్వామ్య సంస్థను లేక సమాజాన్ని సృషించేటటువంటి కృషిలో మనకు ఉన్నలోపాలు ఏమిటి వాటిని దూరంచేయటంలో ఈ council ఏలాగు తోడ్పడుతుంది అనే పునాది మీద ఈ విషయాన్ని ఆలోచించాలి అదే సరియైనటువంటి దృక్పధం అవుతుందని నేను అనుకొంటున్నాను ఒక్క విషయం మీ అందరికీ తెలుసును మనము అందరము ఎన్నుకోబడిన తరువాత మనలో ఒక విధమైన vested interestedness వచ్చిందని ఒకప్పుడు కాకపోతే ఒకప్పుడు బయట ఉన్న సంస్థలు అనుకోవడం తటస్థిస్తున్నది అట్లాగే ఆసంస్థలలోఉన్న వ్యక్తుల గురించి ప్రజలు సర్వసాధారణంగా అనుకోవడం తటస్థిస్తున్నది అదే విధంగా ప్రభుత్వ యంత్రాంగంలో ఉన్నవాళ్లను గురించికూడ ఒక vested interestedness వీళ్లలో వచ్చిందని శాసనసభ్యులు అనుకోవడం జరుగుతూఉంటుంది ఈ అనుకోవడమనేది అసలు ఎందుకువస్తుంది ? ఇది మానవ స్వభావంలోనే ఉన్నదా ? ఉండేటట్లయితే, దీన్ని తట్టుకోవడం ఎట్లాగు ? దీంట్లో ఎక్కువగా సంబంధంలేనటువంటి వ్యక్తుల యొక్క సమయోచిత ప్రజ్ఞ లేక వారి యొక్క అభిప్రాయాలు మనకేమైనా ఉపయోగపడతాయా అని ఆలోచించాలి ఈ దృక్పథంతో ఆలోచించినట్లయితే, Legislative Council అనేది సమయోచితమైనదనిన్నీ, అది చాలా తోడ్పడుతుందనిన్నీ మీకు బోధపడుతుంది ఈపేళ Legislative Council ను ఉంచాలా వద్దా, లేక Lagislative

project లోగాని, ఒక inspiring force గా ఉండి ఇంతో అంతో అక్కడ పనిచేయగలడు, లేక దానికి ప్రాణముపోయగలడు, లేక అక్కడ జ్యోతిని వెలిగించగలడు అని మనము అనుకొంటున్నామో అదే విధంగానే ఒక M L C కూడా అతను ఎన్నుకోబడకపోయినప్పటికీనీ, nomination చేయబడినప్పటికినీ— బహుశ రాజగోపాలాచారిగారివంటివాడు అనుకొందాము, అటువంటివాడు nominate చేయబడినప్పటికినీ, ఒక జ్యోతిని నిలబెట్టగలడు అవసరమైతే కొన్ని కొన్ని జ్యోతులు అక్కడ వెలిగించగలడు, అనే నమ్మకం నాకు ఉన్నది దీనిని మీరు ఈవేళ deny చేసి నిర్లక్ష్యంచేసేటటువంటి పరిస్థితిలోలేరు కాబట్టి ఒకవేళ ద్వితీయ పంచవర్ష ప్రణాళిక successful గా, విజయవంతంగా చేయదలచుకొన్నప్పటికీ, ఒక నాలుగు లక్షల రూపాయలు ఈ council కు పెట్టే బదులు దానినే అదనంగాప్రణాళికకు కేటాయించి, కొంత సర్దుబాటుచేస్తామనుకొన్నట్లయితే దానివల్ల పెద్ద శ్రేయస్సువస్తుందని నేను అనుకోవడంలేదు

తరువాత wages విషయాన్ని దీనికి ముడిపెట్టి కొంతమంది సభ్యులు మాట్లాడం మొదలుపెడుతున్నారు Legislative Council ను గురించి చర్చిస్తున్న ఈ సందర్భంలో బజారులోఉన్న ప్రతి సమస్యను దీనికి లంకెపెట్టి మాట్లాడితే పరిష్కారానికిరాలేము ఈవేళ wages ఎక్కువచేయడం అంటె, అది ఒక recurring expenditure అవుతుంది దానిలోపాటు, మరికొన్ని చిక్కులుఉన్నాయి కొద్దిపాటి మొత్తాలతో ఆగేటటువంటి విషయంకాదది ఒకవేళ ఈ wages విషయం చర్చించవలసివచ్చినా, లేక చర్చ యొక్క ఫలితంగా ఆ wages ఎక్కువచేయదలచినా, దానిని చర్చించవలసిన ప్రదేశము, కాలము వేరు కాబట్టి దాన్ని దీన్ని రెండింటిని ఒకచోటపెట్టి చర్చించడం బాగుండలేదని నేను అనుకొంటున్నాను అంతే కాకుండా ఈవేళ మనం ఏ వాతావరణంలో ఉన్నామో ఆ వాతావరణంలో Legislative Council చాలా తోడ్పడేటటువంటి పరిస్థితులు ఉన్నాయని నేను అనుకొంటున్నాను Opposition సభ్యులు, Legislative Council వచ్చినట్లయితే, అది మనకేమి తోడ్పడదు, లేక అది మన ఉద్యమాలకు తోడ్పడదు, లేక అది రాజకీయేతర విషయాలలో మనకు తోడ్పడదు, అనేవిశ్వాసముతో ఎంత గంటాపథంగా వాదిస్తున్నారో, అంత గంటాపథంగా ఒక విషయాన్ని చెప్పుచున్నాను ఈనాడు Legislative Council ఎక్కడెక్కడైతే వచ్చాయో, అక్కడ కాంగ్రెసు, వాటికి అనుగుణంగా వారి చర్యలు కూడ సభ్యులు చెప్పినవిధంగా ఉన్నట్లయితే, బహుశా, కాంగ్రెసు సంస్థ లేక కాంగ్రెసు సానుభూతిపరులు లేక ప్రభుత్వంలో ఉండేవాళ్ళ వారి వైఖరి గురించి పునరాలోచించుకోవలసిన అవసరం తప్పకుండాఏర్పడేది కనుక ఎక్కడెక్కడైతే వారికి అవకాశాలువచ్చాయో అక్కడ మాత్రము వాళ్ళు తీసుకొంటున్నారు గాని అవకాశాలు లేనిచోట్ల తీసుకోవడంలేదు ఎందుకనేది నా ప్రశ్న కనుక opposition వాళ్ళు కేవలం opposition దృష్టితోనే మాట్లాడుతున్నారు గాని వాస్తవిక దృష్టితో, మాట్లాడటములేదు వాస్తవికదృష్టిలో Legislative Council వల్ల ప్రయోజనముడున్నది, దీనివల్ల ప్రజలకు మేలు కలుగుతుంది అనే విశ్వాసం మాకుఉన్నది Legislative councilయొక్క ఉనికి చాలా

తోడ్పడుతుందని నేను అనుకొంటున్నాను ఈ సందర్భంలో కొంతమంది సభ్యులు ఇంకొక విషయంచెప్పారు ఈ విషయాన్ని ఇదివరలో పార్లమెంటువారు ఒకసారి తిరగగొట్టారు, కాబట్టి మళ్లీ దీనిని పంపించి తిరుగగొట్టించుకోవడం ఎందుకు అనేటటువంటి మాటలు చెప్పుతున్నారు కాని అప్పుడు, దానికి సరియైనటువంటి సమయంకాదు, అనే ఉద్దేశంతో ఆ విధంగాచేశారని మాత్రం నేను మనవిచేసుకొంటున్నాను అప్పుడు అసలు ఆంధ్రప్రదేశ్ ఉండడమా లేదా అనేదే చిక్కు సమస్యగా ఉండిపోయింది ఆ పరిస్థితులలో Legislative Council అనే టటువంటిది inopportune, దానికి అది సరియైనటువంటి సమయం కాదనే ఉద్దేశం తోనే అప్పుడు దానిని అంగీకరించలేదు కనుక వారి మనస్సులను, వారి ఉద్దేశాలను మనంతేట మనం అన్వయించేయుటకు ప్రయత్నంచేసినప్పుడు, ఒక్కొక్కరికి ఒక విధంగా తట్టవచ్చును అయినప్పటికిన్నీ, అప్పుడు దీనికి సరియైన సమయంకాదనే ఉద్దేశంతోనే దీనిని అంగీకరించక పోవడం జరిగింది కాని ఈవేళ కేంద్రనాయకులు, కేంద్రనాయకులతో సంబంధం ఉన్నటు వంటి పెద్దలు దీనిని సాధించగలము అనేటటువంటి విశ్వాసములోఉన్నారు దానికి ముఖ్యమైన కారణం, ఇప్పుడు దీనికి ఉచితమైన సమయం అనిఅనుకొంటున్నారు దీనిని అంగీకరించడంలో చాలా లాభముఉన్నదని నేను అనుకొంటున్నాను సోషలిస్టు సమాజాన్ని నిర్మించడంలో అయితేనేమి ద్వితీయ పంచవర్ష ప్రణాళికను ముందుకు పెట్టేదాంట్లో అయితేనేమి, ఇంకా నేను ఇదివరకే చెప్పిన కారణాలవల్లను, Legislative Council ఉండడం సమంజసంగా ఉంటుందని, ఇది చాలా సహాయకారిగా ఉంటుందని నేను ఆశిస్తున్నాను ఈ కారణాలవల్ల ఈ విషయంలో పెద్ద రభసలేకుండా ఈ తీర్మానాన్ని లందరు ఏకగ్రీవంగా అంగీకరిస్తే బాగుంటుదని తెలియజేస్తూ విరమిస్తున్నాను

శ్రీ ఎస్ వేమయ్య —అధ్యక్షా, ఇప్పుడు వున్నటువంటి ఈ తీర్మానంమీద ఎగువసభ కావాలని కొంతమంది, అవసరంలేదని కొంతమంది చర్చిస్తున్నారు ఈ ఎగువసభ అక్కర లేదనేటటువంటి వారితో ఏకీభవిస్తూ, అనేక విషయములు యితర సభ్యులు చెప్పినట్లు, అదీ వద్దనే వాదాన్నే నేను బలపరుస్తున్నాను ఎందుకంటే ముఖ్యమంత్రిగారు ఈ తీర్మానాన్ని ప్రవేశ పెడుతూ దానికయ్యే వ్యయము మాత్రము తక్కువగా వుంటుందని, వచ్చే ఫలితము ఎక్కువగా వుంటుందని కూడా శెలవిచ్చారు నేను ఒక్కవిషయం మాత్రం వారిని ప్రశ్నించవలసి వుంటుంది ఈ ఎగువ సభకు ఎంత వ్యయము అవుతుంది? ప్రజల ధనము దీనికి కేటాయించవలసి వచ్చినపుడు ఆ సంగతి వారు సరైనటువంటి ఖర్చు చెప్పలేదు దీనికి సిబ్బంది వున్నది ఆ లెక్కలు చెప్పటానికి వీలు అవుతుంది ఎక్కువ వ్యయము వుందని చెప్పడములో, ఏ పదో, వందో, వెయ్యో, అల్పమైన బడ్జెటుతో అది సరిపోతుందని ప్రజలు ఊహ పడి ఉండవచ్చును ఆ ఊహాతో నేను ఏకీ భవించుటలేదు అంత వ్యయము ఖర్చుపెట్టి ఈ ఎగువ సభను వుంచుకొనటమా అనేదీ తీసు కొన్నప్పుడు, నేను ఉజ్జాయింపుగా కొన్ని లెక్కలు చెప్పుతాను ఒక మాసానికి ౭౨ మంది కౌన్సిలు సభ్యులు వుంటే, రెండు లక్షల రూపాయలకు తక్కువ కాకుండా ఖర్చు అవుతుంది అట్లాగే అయిదు సంవత్సరములకు సాలుకు మొత్తంమీద పది లక్షల రూపాయలవరకు తక్కువ కానటువంటి వ్యయము కౌన్సిలుమీద ఈరోజు మనం ఖర్చుపెట్టేపరిస్థితిలో ఉన్నామా అని ప్రశ్నవేస్తే, లేమని తేలుతుంది అటువంటి పరిస్థితులు మనకు లేనప్పుడు ఇంత వ్యయం ఖర్చుపెట్టి

కౌన్సిలు ఉంచుకొనుట సబబు కాదని మనవి చేస్తున్నాను అంతేకాకుండా వారి వలన మనకు ఈ దిగువ సభకు, అమోఘమైనటువంటి సేవ లభిస్తుందని వారు చెప్పారు నేను ఒక విషయం మాత్రం తెలియజేస్తాను మనకు కావలెనన్నట్లయితే పెద్దల సలహాలు గాని, వారి అమోఘమైన ఆదేశాలుగాని ఉచితంగానే లభిస్తాయి వారివద్ద తీసుకొనవచ్చును డబ్బు పెట్టి కొనుక్కుతెచ్చుకోవలసిన అవసరం లేదు ఉచితంగానే లభిస్తాయి అటువంటప్పుడు వారి సలహాలు, తెలివితేటలు డబ్బుపెట్టి ఎందుకు కొనుక్కోవాలని ప్రశ్నిస్తున్నాను అంతేకాదు ఇప్పుడు మనముందు ఎంతో వ్యయముతో కూడిన ప్రణాళికలున్నాయి అనేక సమస్యలున్నాయి ఒక్క ద్వితీయ పంచవర్ష ప్రణాళికే కాదు, ఈ రోజున పాఠశాలల్లో రాజ్యాంగ చట్టము రీత్యా అందరు పిల్లలకూ ఉచిత విద్యను గరిపే విద్యా విధానం లేదు ప్రసూతి గృహాలు (మందిరాలు) లేక పల్లెలలో అనేక మంది ప్రాణాలు పోగొట్టుకొంటున్న పరిస్థితులు ఉన్నాయి అటువంటి సౌకర్యములు కలుగజేసుకొనేందుకు డబ్బు, తాహతు ఉన్నదా అంటే లేదు బస్సు స్టేండ్లవద్ద, రైళ్ళవద్ద, జన సమ్మర్దము ఉన్న చోట్ల కుష్టురోగులు మొదలైనవారు వెంటబడుతున్నారు అటువంటి వాటన్నింటిని నవరించుకొనుటకు తగిన ఆర్థిక విధానం మనకు లేనప్పుడు, ఈ ఎగువ సభ ఎంతమాత్రము కూడ మనకు అవసరంలేదని నేను మరొక సారి మీద్వారా ప్రభుత్వానికి తెలియజేస్తున్నాను అయితే ఇంతకు పూర్వం సభలో తీర్మానం జరిగింది మరొక దఫా ఆంధ్రనుంచి వచ్చినవారు, ఇక్కడి వారు దీనిని ఏకగ్రీవంగా అంగీకరించాలని చెప్పారు అయితే ఒకసారి పరీక్షలో తప్పినటువంటివాడు మళ్ళీ పరీక్షకు attempt చేయకూడదని ఇది అర్థము ఇస్తుందా? ఒకసారి fail అయితే తిరిగి attempt చేయకూడదనేది లేదు తప్పకుండా attempt చేయాలి ఒకసారి తప్పినా మరొకసారి నెగ్గే సూచనలు ఉంటాయి కాబట్టి దీనిని గురించి ఇదివరకు చర్చించటము అయిపోయింది ఇప్పుడు తిరిగి చెప్పనక్కరలేదనే వాదనతో నేను ఏకీభవించలేక పోతున్నాను

ఈ రోజు హైదరాబాదు లోనివారు గాని, ఆంధ్రనుంచి వచ్చినవారు గాని, చిన్న ఉద్యోగస్తుల పెద్ద ఉద్యోగస్తులమధ్య జీతాలలో ఎంతో అఘాతం, ఎంతో తేడా వున్నది తరువాత కేంద్ర ప్రభుత్వ ఉద్యోగస్తుల మధ్య రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగస్థులమధ్య తేడా వున్నది దానితో వారు సతమత మవుతున్నారు ఇక్కడ వున్నటువంటి ఉద్యోగస్థులకు ఆంధ్రరాష్ట్రంనుంచి వచ్చిన ఉద్యోగస్తులకు జీతాలలోతేడా వున్నది ఇక్కడ సిటీలో వున్నటువంటి ఖర్చులు అక్కడివారు భరించలేకపోతున్నారు ఈ అఘాతం, ఈ తేడా తీర్చే దానికి దీనికి ఈ ప్రభుత్వం పూనుకోడానికి ఎంతో డబ్బు అవసరం వున్నది కాబట్టి ఈ పరిస్థితులన్నిటిని దృష్టిలో పెట్టుకొని, ఈ ఎగువ సభను విరమించుకొనుట ఎంతైనా అవసరమని మనవి చేయుచున్నాను ఈ సందర్భంలో కేంద్ర ప్రభుత్వంవారు కూడా పార్లమెంటులో చర్చించినప్పుడు మనకు ఎగువసభ ఉంచకుండానే వారు పంపించారంటే దానిలో ఏదో అర్థం ఉన్నదన్నమాట ఉదారంగా ఆంధ్రప్రదేశ్‌కు ఎగువసభ అవసరం లేదనో, లేక దానికయ్యే ఖర్చును భరించలేరనే ఉద్దేశముతోనో వారు అక్కడ పార్లమెంటులో pass చేసి ఉండలేదు మనకు అవసరం లేదనే కాబోలు పార్లమెంటులో ప్యాస్ కాకుండా ఇది తిరిగి వచ్చింది దీనిని పార్లమెంటులో ప్యాస్ చేయకుండా నిర్దాక్షిణ్యంగా పంపించారంటే దాని ఉద్దేశం ఇది అవసరం లేదని కూడా తెలియచేసోంది అయితే ఈ

ఎగువసభ అవసరమా లేదా అనేటటువంటి ఏ వాదననైనా సరే తీసుకొని మాట్లాడవచ్చునని ముఖ్య మంత్రిగారు మొదట్లో చెప్పారు అయితే ఈ రోజున అత్యవసర సమస్యలు మనకు అనేకం ఉన్నాయి దేశంలో ధరలు పెరుగుతున్నాయి ఎలిమెంటరీ పాఠశాలలలో ఉచిత విద్య గరిపే విధానం లేక జీతాలు కట్టుకోలేక పోతున్నారు మొన్ననే ప్యాన్ చేసినటువంటి ఉచిత విద్యా విధానం ఉన్నది మరల ఒక్కతూరిగా arrears జీతాలు అన్ని కట్టాలని ఈ మధ్య ఉత్తరువు పోయినట్లు తెలుస్తోంది ఒకటవ ఫారము నుంచి, మూడవ ఫారము వరకు తప్పి పోయినవారికి స్కూలు ఫీజు చెల్లించాలని ఉత్తర్వులు పోయినట్లు తెలుస్తోంది ఈరోజున ఒకేదఫా, గడచి నటువంటి మాసాలకు జీతాలు కట్టమంటే కట్టే పరిస్థితులలో తల్లిదండ్రులు లేరు అందువలన విద్యకు స్వస్తి చెప్పి ఇండ్లకు పంపే పరిస్థితిలో ఉన్నారు ఆ విధంగా ఈ రోజున ఉన్నది

ఒటువంటి పరిస్థితులలో మనము ఈ సభను ఉంచుకోవాలంటే, ఈ అత్యవసరాన్నిగుర్తిం చటములో ప్రజలుకూడా ఏకీభవించరు ఇటువంటి ఇబ్బందులతో కూడిన రాష్ట్రంలో రెండవ సభ పెట్టుకుంటున్నారా? అని ప్రశ్నవేస్తే ప్రజలకు జవాబు చేప్పే పరిస్థితిలో లేమని మనవి చేయుచున్నాను ఎంతో వ్యయముతో ఈ ఎగువ సభను పెట్టకుండానే పెద్దలయొక్క అమోఘ మైనటువంటి తెలివితేటలు, సలహాలు మనకు ఉచితంగానే లభిస్తాయని మొదట్లోనే నేను మనవి చేశాను అంతే కాకుండా మనకు పైన ఒక సభను పెట్టుకుంటామంటే ఈ సభయొక్క సభ్యులు ఒసమర్థులని, పనికిమాలినవారని నిర్ణయించే విధముగా ఉన్నదని పైన వారిని పెట్టుకున్నా మంటే మనకు inferiority complex ఉన్నదని భయపడుతున్నామని కూడా స్పీకరుగారి ద్వారా ప్రభుత్వానికి తెలియజేస్తున్నాను అందువల్ల ఈ సభ అవసరం లేదని నేను మనవి చేస్తూ యింకొక విషయం కూడా చెప్పుతున్నాను కౌన్సిలులో ఏదైనా ఒక విషయం చర్చకు వచ్చినపుడుఏదైనా ఒక ప్రశ్న వచ్చినపుడు సమాధానాలు చెప్పేవారు మంత్రులే ఇక్కడి మంత్రులే సమాధానం చెప్పాలి వీరు ఏదైనా మూడవ చేంబరు నుంచి వచ్చారా? లేదు ఇక్కడ వున్నటువంటి వారే కౌన్సిలువద్దకు పోయి వారికి సమాచారం యివ్వాలి వారి ప్రశ్నలకు జవాబు చెప్పాలి ఈ సమాచారం ఇచ్చేది యిక్కడి మంత్రులేగాని క్రొత్తగా ఎక్కడనుంచో రారు ఇక్కడ వున్న సమస్యలే అక్కడకూడా ఉంటాయి ఈ మంత్రులే క్రిందికీ పైకి తిరుగుతూ వుంటారు వీరు ఇచ్చే సమాచారంలో ఎక్కువ తేడా వుండదు కాబట్టి ఎగువ సభయొక్క అవసరం లేదు ఈ కొద్ది మాటలతో నేను పూర్తిగా ఈ కౌన్సిలు ఉండకూడదని వ్యతిరేకిస్తూ నేను ఇంతటితో సెలవు తీసుకొంటున్నాను

*శ్రీ ఎ బాపినీడు (కొవ్వూరు—జనరల్) అధ్యక్షా, ఈ లెజిస్లేటివ్ కౌన్సిలు ఉండాలన్న తీర్మానాన్ని నేను బలపరుస్తూ ఎందుకు వుండాలనే విషయంగురించి చెబుతాను మన సోదర సభ్యులు కొందరు లెజిస్లేటివ్ కౌన్సిలు ఉండకూడదనే విషయంకూడా చెప్పారు మన ఇండియాలో ఉన్నటువంటి పెద్ద రాష్ట్రాలన్నిటిలో కూడా లెజిస్లేటివ్ కౌన్సిల్సు ఉన్నాయి ఇవికేవలం పదవులకోసమే కాదు కొంతమంది సోదర సభ్యులు చెప్పినట్లు లెజిస్లేటివ్ అసెంబ్లీ ఎలక్షన్సులో ఓడిపోయిన కొందరికి లెజిస్లేటివ్ కౌన్సిలు ద్వారా మంత్రి

పదవులు యిచ్చుటక్కై యిది ఉద్దేశింపబడినదని చెప్పటం సరైనది కాదు "కాంగ్రెసువారు దొడ్డిదారిన మంత్రి పదవులలో ప్రవేశించటానికి వీలు లేదు, లెజిస్లేటివ్ కౌన్సిలునుంచి మంత్రులు కావటానికి వీలులేదు" అని కాంగ్రెసు పార్టీవారు చెప్పారు అందుచేత లెజిస్లేటివ్ కౌన్సిలు మంత్రి పదవులకు మాత్రమేనని ఆపోహాలు పడ నక్కర లేదు

లెజిస్లేటివ్ కౌన్సిలు, అసెంబ్లీ చేసిన తీర్మానాన్ని ఎంతవరకు అదుపులో వుంచుతుంది అను విషయము చర్చనీయాంశము అనటానికి సందేహము లేదు అయితే లెజిస్లేటివ్ కౌన్సిలు ఉండటము కొంతమందికి పదవుల కోసమేనని చెప్పటము సరైనది కాదు లోకల్‌బోర్డులలో ఉండేటటువంటివారు, చేంబర్ ఆఫ్ కామర్స్ లో వుండేవారు, విద్యావేత్తలు, మాజీ మంత్రులు, పెద్ద మనుష్యులు వయోవృద్ధులు,—వీరందరు వారి అమూల్యమైన సలహా ఇవ్వటానికి కౌన్సిలు అనే సంస్థ అవసరమని పెద్దలందరు గుర్తించిన విషయమే ప్రతి పెద్ద రాష్ట్రంలో కూడ యీ కౌన్సిలు పెట్టినారు ఆంధ్రప్రదేశ్‌లో పెట్టే విషయంలో "మీర్క కూడా రిజల్యూషన్ పంపితే కౌన్సిలు పెట్టేదానికి మాకు అభ్యంతరము లేదు" అని కేంద్ర ప్రభుత్వం సూచించినమీదట, ఇవ్వాళ అధికార రీత్యా యీ తీర్మానం తీసుకురాబడింది అయితే యీ కౌన్సిలువల్ల నాలుగులక్షల రూపాయలు అవుతాయి, యీ డెఫిసిట్ బడ్జెటు రోజుల్లో డబ్బులేని రోజుల్లో, ప్రజాస్వామ్యం ముందుకు పురోగమించే రోజుల్లో యీ కౌన్సిలు ఎందుకు అని మన సోదరులు విమర్శిస్తున్నారు ఈ కౌన్సిలు అనేది ఇక్కడే కాకుండా, ప్రతి దేశంలోను ఒక ఎగువసభగా ఉన్నది అనుభవము కలిగినవారు అక్కడవుండి, శాసనసభనుంచి పోయే టటువంటి విషయాలను అక్కడ బాగా విమర్శించి, 'అసెంబ్లీలో చేసిన విషయాలు సరియైన స్థితిలో లేవు, తొందరగా వారి అభిప్రాయము వెలిబుచ్చారు" అని చెప్పి తిరిగి మళ్ళీవిషయాలను అసెంబ్లీకి పంపటానికి అవకాశంవుంటుంది ఆవిధంగా వారు పంపటానికి శక్తి వున్నది కాబట్టి లెజిస్లేటివ్ కౌన్సిలు పెట్టటం చాలా మంచిది అందులోను ముఖ్యంగా మూడువందల మంది మెంబర్సు గలిగినటువంటి ఈ అసెంబ్లీ కార్య క్రమాలను పరిశీలించడానికి, ఇరవై జిల్లాలు కలిగినటువంటి యీ ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలో కౌన్సిలు లేక పోవటం మంచి పని కాదని చెబుతు న్నాను అందులో ఏమాత్రము సందేహము లేదు కనుక మన సోదరులు అందరు కూడా యీ తీర్మానాన్ని ప్యాస్ చేయాలని కోరుతున్నాను దీంట్లోకి ఒక కాంగ్రెసు పార్టీనుండి సభ్యులు వస్తారని అనుకోరాదు ప్రపోర్షనేట్‌గా వారి వారి బలాలను బట్టి అన్ని పార్టీల నుంచి ప్రతినిధులు వస్తారు అసెంబ్లీనుంచి కాక లోకల్‌బాడీలు ఇతరసంస్థలగుంచి నుంచి, గ్రాడ్యుఏట్స్ కాన్స్టిట్యుయన్సి నుంచి అన్ని రకముల రిప్రజెంటేషన్స్ ఉంటాయి అందరూ రావటానికి అవకాశం వుంటుంది కౌన్సిలు సభ్యులు కావటానికి, అక్కడ శాసనములు చర్చించటానికి అన్ని పార్టీలకు అవకాశం వుంటుందని చెబుతూ, యీ తీర్మానాన్ని అందర్క ఒప్పుకొంటే సమంజసంగా ఉంటుందని తెలియ జేస్తున్నాను ఇది దేశమునకు కూడా మంచిదని చెబుతూ నేను సెలవు తీసుకొంటున్నాను

*శ్రీ యం సత్యనారాయణరాజు (చీపురుపల్లి—జనరల్)—అధ్యక్షా, ఈ దినమున గౌరవనీయ ముఖ్యమంత్రిగారు ఎగువశాసనసభ ఉండవలెనని ఒక తీర్మానము ప్రతిపాదిస్తూ, ఆసభ ఆవశ్యకతను సమర్థిస్తూ చెప్పారు గాని అది ఏమాత్రం సమర్ధనీయంగా లేదని చెప్పటానికి ఇందుకు నేను వ్యతిరేకినని చెప్పటానికి చాలా విచారిస్తున్నాను వారు కొన్ని కొన్ని విషయాలు చెప్పారు వారు చెప్పిన విషయాలు అంత సమర్థనీయములు కావు వారు ఈ సభనిమిత్తం ఇంచుమించుగా నాలుగు లక్షల రూపాయలు ఖర్చు అవుతుంది, ఇదీ ఏమంత అని సులభంగా ఆ ఖర్చుగురించి మాట్లాడారు గత అనుభవంబట్టి చూస్తే, మేము ఏ విషయంలోనైనా చెప్పే టటువంటి పనులను, ఆర్థికలోపంవల్ల చేయలేమని ప్రభుత్వం చెప్పిన సందర్భములు ఉన్నా — ఈ నాలుగు లక్షల రూపాయలు తృణప్రాయంగా ఆలోచించి చెప్పటము, ఎగువ శాసనసభ అవసరమని చెప్పటము అర్థరహితంగా వున్నది ఎగువశాసనసభ చేసే పనులు ఏమిటి? దాని ప్రయోజనము ఏమిటి? ఆ ప్రయోజనములకు తగినటువంటి ఖర్చు ఏంత? దీని ప్రతిఫలము ఏమిటి? అనేది ఆలోచిస్తే యీ ఖర్చుకు తగిన ప్రతిఫలము లేదని తెలుస్తుంది ఈ నాలుగు లక్షల ఖర్చు అనేకాదు నికరంగా బడ్జెటు లెక్కలు వేసినపుడు అనుకున్నదానికంటె ఎక్కువ ఖర్చు అవటం మామూలు పరిపాటి అవుతూంటుంది నోటి లెక్కలలో నాలుగు లక్షలు అంటే అసలు ఖర్చు హెచ్చు అవుతుంది అనే విషయం మనము ఊహించవచ్చును నాలుగు లక్షలే కాదు, ఐదు లక్షలు ఖర్చు అయినప్పటికీ దీనివల్ల ఏదైనా ప్రతిఫలం వుందా అంటే అట్టి ప్రతిఫలం ఏమీ కపించదు ఇందులో ప్రజాస్వామికంగా కాకుండా, ప్రత్యేకంగా కొందరు విద్యావంతులు, మన డిస్ట్రిక్టు బోర్డు వగైరా లోకల్ బాడీనుంచి, ఇంకా కొందరిని తీసుకురావచ్చునని ముఖ్యమంత్రిగారు చెప్పారు సరే, నిజమే అయితే యీ ఎలక్షన్సుకు సభ్యులను సెలక్టు చేసుకున్నప్పుడే విద్యావంతులను ఎంచుకోవచ్చును ఈ సెకల్షనులోనే వీరిని తీసుకొనవచ్చును అమ్మన్నరాజాగారు 'అట్టివారు ఎలక్షనులో పాలొనటానికి కష్టపడతారు, వారిని ఎలక్షన్సులో కాకుండా, నామినేషన్ మూలముగా తీసుకురావటం సులభంగా వుంటుంది అన్నారు" (ఇంటరప్షన్) లదే ఇన్‌డైరెక్టు ఎలక్షన్సు ఇన్‌డైరెక్టు ఎలేక్షన్సు కూడా నామినేటెడ్ ఎలక్షన్సు వంటివే, అది ప్రజాస్వామికం కాదు కాబట్టి ఇంతకంటె హెచ్చు అనుభవం కలవారిని, పెద్దవాళ్ళను విద్యావేత్తలను, ప్రభుత్వపరిపాలనలో అనుభవము వున్నవాళ్ళను, పరిపాలన విధానములో పెద్ద పేరు పడినవారిని స్పెషలు కమిటీలలోకి తీసుకొన్నటప్పటికి కూడా ఆ కమిటీలు తయారు చేసిన రిపోర్టులను ఎంతవరకుగౌరవించింది మన ప్రభుత్వం దానికి తార్కాణం శొంఠిరామమూర్తి కమిటీవారు ప్రొహిబిషను పై యిచ్చిన రిపోర్టు వారు రిపోర్టు ఇవ్వటములో కూడ, ఎంతో భక్తి శ్రద్ధలతో, ఎక్కువ కష్టం తీసుకొని ఇంటింటికి పోయి, ఊరూరు తిరిగి, పల్లెటూళ్ళకు వెళ్ళి నిజపరిస్థితులు తెలుసుకొని తమ రిపోర్టు ప్రభుత్వానికివ్వటం జరిగింది అటువంటి రిపోర్టును ఎంతవరకు గౌరవించారు? ఇప్పుడు ఈ ఎగువసభకు అటువంటి వారిని తీసుకొని వస్తే, వారు చేసిన తీర్మానములను, ఆ ప్రొహిబిషను కమిటీ రిపోర్టును గౌరవించిన విధంగానే గౌరవిస్తారే తప్పితె ఎక్కువ గౌరవించరని చెబుతున్నాను "ఈ అసెంబ్లీలో మనము తొందరపాటుచేత కొన్ని కొన్ని తీర్మానాల చేస్తూంటాము ఆ తీర్మానాలను ఎగువ కౌన్సిలు సరిదిద్దుతుంది తిరిగి వాటిని అసెంబ్లీకి పంపిస్తుంది' అని చెప్పారు కాని అటువంటి అవసరంకూడా ఏమీ వుండదు ఎందుచేతనంటే, మనము

మామూలుగా యీ శాసనసభలో ఏ విషయం వచ్చినా తర్జన భర్జనలు చేసి, అన్ని పక్షాలవారు అతి విపులంగా చర్చించి ఏదో ఒక తీర్మానానికి వస్తాము సభ్యులకు నచ్చినట్లయితే మనము ప్రతి బిల్లు, ప్రతి తీర్మానముకూడా మన రాష్ట్రపతి ఆమోదానికి, పంపిస్తున్నాము రాష్ట్రపతి భవనములో మనము అనుకున్నదానికంటే హెచ్చు విద్యావేత్తలు లేక పరిపాలనలో సమర్థులైనవారు ఉంటారు కనుక అక్కడ కూడా దానిని తిరిగి పంపించడానికి అవకాశముంటుంది ఆ విధంగా చేయబడడానికి అవకాశమున్నపుడు ఈ ఎగువసభను ౫, ౬ లక్షల రూపాయలు ఖర్చుపెట్టి ఏర్పరచడము అనవసరము

మిస్టర్ స్పీకర్ —౫ గంటలైంది రెండు నిమిషాలలో మీరు పూర్తిచేయగోరుచున్నాను

శ్రీ ఎమ్ సత్యనారాయణ రాజు రెండు నిమిషములలో పూర్తి చేస్తాను, తర్వాత నా అనుభవమును బట్టి ఎగువ శాసన సభలు ఆవసరము కాదని,ఎగువ శాసనసభలో వున్న సభ్యులకు హెచ్చు బాధ్యతగల పనులేవి అప్పజెప్పకూడదు అని కూడా మన నెహ్రూగారు చెప్పి వున్నారు ఇదివరకు ఈ తీర్మానాన్ని త్రోసివేయడము జరిగింది ఈ రెండు శాసనసభలు, అనగా ఆంధ్ర శాసన సభ్యులు మన తెలంగాణా శాసనసభ్యులు, కలసిన తర్వాత కూడా ఇటువంటి అవసరము ఎందుకు కల్గిందో అర్థము కావడము లేదు అందుచేత ఏవిధంగా చూచినా వున్న అనుభవమును బట్టి పెద్ద నాయకులు చెప్పిన దానిని బట్టి గత చరిత్రను బట్టి వున్న పరిస్థితులను బట్టి చూస్తే ఇది సమర్థనీయమైంది కాదు కాబట్టి ఎంతమాత్రము ఎగువ శాసనసభ అవసరము లేదని మనవి చేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను

*Mr Speaker* The House now stands adjourned till 10 a m tomorrow

*The House then adjourned till Ten of the Clock on Wednesday, the 5th December* 1956